# సుఖీభవ

ూర్వం మనదేశంలో ఎన్నెన్నో అరణ్యా లుండేవి.

అరణ్యాలను 'వనాలు' అనీ 'కాననాలు' అనీ కూడా అంటారు.

నైమిశారణ్యం పురాణాలలో ఎంతో పేరుపొందింది. ఈ నైమిశారణ్యం సూత మహర్షి శౌనకాది మునులకు పురాణాలను పద్ధెనిమిదింటినీ ్రడు.

ఖాండవ వనం వంటివి మహాభారతంలోనూ, దండకారణ్యం వంటివి ాయణంలోనూ ప్రసిద్ధిచెందాయి. లుంబినీ వనంలో బుద్ధదేవుడు ాడు.

ఈ రీతిగా మన పురాణాలలోనూ, ఇతిహాసాలలోనూ, చరిత్రలోనూ ులు ఎంతో ముఖ్యమైన స్థానాన్ని గొప్పతనాన్ని కూడా పొందాయి.

ఇలాటి అరణ్యాలలోనే మనం యిప్పుడు చెప్పుకోబోయే కథకూడా ది. ఆ అరణ్యం పేరు "మృగవనం." అంటే ఆ వనంలో ఎన్నోరకాల వులు జీవిస్తూ వుండేవన్నమాట.

ఆ జంతువుల రాజ్యానికి ఒక రాజుగారు వుండేవాడు. ఆయనగారు వర్తి" అనే పేరుగల సింహం! అందుకే సింహాన్ని మృగరాజు అని ్రరు.

ప్రతి సంవత్సరం సమవర్తి తన పుట్టినరోజు పండుగను ఎంతో వైభవంగా జరుపుకొనేవాడు. ప్రజలకు కూడా ఆయనగారి పుట్టినరోజు పండుగ వచ్చిందంటే యెంతో సంతోషంగా వుండేది. ప్రజలకు యెలాంటి బాధ కలుగకుండా, తన బిడ్డలవలె ప్రజలను పరిపాలించే రాజును ప్రజలు కూడా ప్రాణంతో సమంగా ప్రేమిస్తారు కదా! అలాగే సమవర్తిని కూడా అతని ప్రజలు ఎంతో గౌరవించేవారు, ఎంతో ప్రేమించేవారు!

దేవుడులాంటి మహారాజును ప్రజలంతా ప్రేమిస్తూవుంటే, చూసి ఓర్వలేనివాళ్ళుకూడా కొందరు ఆ రాజ్యంలో వున్నారు. వారికి నాయకుడు 'కుటిలుడు' అనే నక్క.

'కుటిలుడు' అనే పేరుకు తగినట్లుగానే యెప్పుడూ కుటిలంగానే ఆలోచించటం, కుటిలంగా మాట్లాడటం, కుటిలపు పనులు చేస్తూ వుండటం ఆ నక్కకు బాగా అలవాటు. అయితే ఏం? తన కుటిల బుద్ధిని మాత్రం అంత తొందరగా ఎవ్వరికీ తెలీకుండా, తన స్వార్థం తాను చూసుకుంటూ వుండటంలో అతడెంతో నేర్పరి.

"ఈ రాజుగారు యెంతకాలం యిలా ప్రజల ఆదరణ పొందుతాడో నేను చూస్తాను. కండబలం వుంది కదా అని మృగాలన్నింటికీ రాజునని విర్రవీగితే సరిపోయిందా! చూడండి! నా బుద్ధిబలంతో ఈ మృగేంద్రుని ఈ ప్రజలఎదుట ఒక ద్రోహిగా రుజువు చేస్తాను. అతడు కూర్చున్న సింహాసనంమీద నాకు నచ్చిన మరొకరిని మహారాజు చేసి కూర్చోపెడతాను" అంటూ శపథం కూడా పట్టాడు కుటిలుడు.

కుటిలుడు తన ప్రతిజ్ఞ యెంతవరకు నెరవేర్చుకుంటాడో చూడాలని కూర్చున్నవారూ వున్నారు! వారు యెవరో తెలుసా! తోడేళ్ళు!

"చేతనయినంతవరకు సహాయం చేస్తాం. మీరేం చేయమంటే అది ...ం. మా దగ్గర మీరు దేనినీ దాచకుండా, మీ పథకాలు యెప్పటి కప్పుడు ...తూవుంటే మాకు చేతనయినంత వరకూ మీతో చేయి కలుపుతాం" ...యి కుటిలునితో తోడేళ్లు!

తోడేళ్ళ అండ చూసుకున్నాడు కుటిలుడు. సరిగ్గా రాజుగారి పుట్టినరోజు ...గనాడే తన ఆలోచనలను అమలులోకి తీసుకురావాలని సంకల్పించాడు.

అందరూ ఆనందంగా పాల్గొనే రాజుగారి పుట్టినరోజు ఉత్సాహాన్ని రసా పాలు చేసి, ప్రజలలో భయాన్ని, ఆందోళననూ లేపి, ముందుముందు ...రంగంలోకి తెచ్చే తన గొప్ప గొప్ప ఆలోచనలను మొదటిసారిగా ఆ రోజే ...టపెట్టాలని నిర్ణయించాడు కుటిలుడు !

రాజుగారి పుట్టినరోజు పండుగ రానేవచ్చింది. మంత్రులందరూ కలసి పెద్ద ...త్తున ఏర్పాట్లనీ పూర్తి చేశారు.

కోకిలమ్మ పాటకచ్చేరీ ఏర్పాటయింది. తీయటి గాన రసామృతంతో కోకిల ...గేంద్రునీ, రాణీగారినీ, మంత్రులనూ, సభికులనూ ఆనందపరిచింది. కోకిలమ్మ ...కు అడవి ప్రక్కనేవున్నలోయ కూడా మారు పలికింది.

ఎన్నెన్నో పుట్టిన రోజులు ఈ రీతిగనే జరగాలనీ, మీ పరిపాలనలో ...లం... శాంతి శాంతి భద్రతలు పొందాలనీ కోకిలమ్మ తనపాటలో రాజుగారిని ...వదించింది.

గానకోకిలకు మృగేంద్రుడు వెదురు పొదలలో దొరికిన మణులను బహు ...గా ఇచ్చాడు.



ఆ తర్వాత నెమళ్ళ నృత్యం జరిగింది. రంగు రంగుల పింఛాలను విప్పుకొని నెమళ్ళు ఆడుతుంటే వనదేవతలందరూ వచ్చారు. సుందరమైన మయూర నృత్యం చూసి ఆనందించారు.

అది వసంత ఋతువు. అడవిలోని చెట్లన్నీ కొత్త కొత్త చిగుళ్ళతో, రంగు రంగుల పూలతో సువాసనలతో ఎంతో రమ్యంగా వుంది. రాజుగారిపుట్టిన రోజు పండుగకు చిలుకలు బారులుతీర్చి ఎగిరి వస్తుంటే, ఆ చిలుకల రథంమీద

రతీదేవితో కలసి మన్మధుడు విజయం చేసినట్లుగా వుంది. మదనునికి ప్రాణ స్నేహితుడు వసంతుడు. ఆ అడవిలోని వసంత వేదిక వద్దనే రాజుగారి జన్మ దినోత్సవం జరుగుతోంది.

పాటలూ, ఆటలూ ముగిసేక, అందరికీ చెట్టు తేనెలు, పుట్టతేనెలు, అడవి పళ్ళు, ఇప్పపువ్వుల కల్లు ... ఎన్నెన్నో వడ్డించి కడుపునిండా విందు భోజనాలు ఏర్పాటు చేశారు రాజుగారు.

భోజనాల తర్వాత ఉపన్యాసాలు ప్రారంభించారు.

"మన మహారాజు ధర్మదేవత వంటివారు. వారికి పక్షపాత బుద్ధిలేదు. ఆత్మబంధువునయినా నేరం చేస్తే విడిచి పెట్టక శిక్షించుతారు. మంచిపని చేసిన విరోధినికూడా మెచ్చుకుంటారు. ప్రజల క్షేమమే తన క్షేమంగా భావి స్తారు. వారు ఇలాగే చిరకాలం మనకు ప్రభువులుగా వుండేరీతిగా భగవంతుడు మనలను అనుగ్రహించాలి!" అని ఉపన్యాసం ఇచ్చేడు అంతరంగిక వ్యవహారాల మంత్రి అయిన 'హితబుద్ధి' అనే పేరుగల ఎలుగుబంటు. వీరినే భల్లూకపతి అని కూడా పిలుస్తారు.

"రాజుగారు మహావీరుడు. ఆయన పరాక్రమం ముందు ఎవ్వరూ పనికిరారు. పరాశక్తి అయిన దుర్గాదేవికి మన మహారాజుగారు వాహనంగా వుంటున్నారు. అందుచేత ఆ మహాతల్లిని 'సింహాసనేశ్వరి' అని కూడా పిలుస్తారు. ఆ శక్తి స్వరూపిణికి వీరు సేవకులు కనుక వీరిలోనూ ఆ శక్తి అంశ కనిపించుతూ వుంటుంది. వీరిఆజ్ఞలను శిరసావహిస్తూ, వీరికి నచ్చినట్లుగా నడుచుకోవటం మన విధి. అప్పుడే మనం అందరమూ సుఖపడతాం" అన్నారు రక్షణ మంత్రిగారయిన "ధీరశాలి" అనే పేరుగల 'పెద్దపులి' వీరిని వ్యాఘ్రేశ్వరుడు అనీ పిలుస్తారు!

ఇంకా ఇతర మంత్రులుకూడా రాజుగారు ఎలాటి సేవచేస్తూ ప్రజలను పరిపాలించుతూవున్నారో వివరించారు.

చివరకు కుటిలుని వంతు వచ్చింది.

కుటిలుడు కూడా ఆర్థిక మంత్రిగా మంత్రి మండలిలోనే ఒకడుగా వుంటున్నాడు. కాబట్టి అందరు మంత్రులతోనూ అతనూ ఏదో ఒకటి మాట్లాడాలి. అందరూ కలసి మహారాజును పొగడేస్తుంటే కుటిలునికి అసూయ కలిగింది ప్రజలలో రాజుగారిపైన ఏదో విధంగా అయిష్టత కలిగించాలి అనుకున్నాడు. ఇలా ఉపన్యసించాడు.

"మహా ప్రజలారా ! ఇంతవరకూ మంత్రులందరూ మీకు కొత్త సంగతులు ఏవీ చెప్పలేదు. నేను చెబుతాను వినండి.

"మహారాజు గొప్పవారే ! కాదనం ! వారు బాగానే పరిపాలిస్తున్నారు ! దీనినీ కాదు అని అనం ! అయితే ఇలా ఎంతకాలం వారు పరిపాలించగలరు ? అనేది నా ప్రశ్న, వారికి ముసలితనం ముంచుకు వస్తోంది. పైగా ఇంతవరకూ సంతానం లేదు.

"ఒక సంవత్సరం పైబడిన కొలదీ ఒక సంవత్సరం ఆయుర్దాయం తగ్గిపోతోంది. ఈ సంగతి గుర్తిస్తే మహారాజులు ఈ రీతిగా పుట్టినరోజు పండుగనాడు ఇంత ఆడంబరాన్ని, ఆర్భాటాన్ని చేసి వుండరు రోజులు ఎప్పుడూ ఒక తీరుగా సాగవు. ఉన్నట్లుండి రాజుగారు ఏ గుండె జబ్బుతోనో మరణించారనుకోండి..." ఇలా అనేసరికి జనంలో కలకలం బయలుదేరింది.

"నోరు మూసుకొని కూర్చోక ఇలా దేనికి వాగుతావ్ ? రాజుగారి దగ్గర నిన్ను చంపటం ఇష్టంలేక నీ అధిక ప్రసంగాన్ని విని, సహించి వూరుకుంటున్నాం. ఇంకా ఎక్కడయినా అయితే ఈ పరికి నిన్ను చంపేసి వుంచేవాళ్ళం.

బుద్ధి తెచ్చుకొని జాగ్రత్తగా మసులుకో. నువ్వు ఉపన్యాసం ఇస్తే మేమంతా వెళ్ళిపోవలసి వస్తుంది." అంటూ ప్రజలు ఆగ్రహంతో అరిచారు. అల్లరి చేశారు.

"ప్రజలారా! మన ఆర్థిక మంత్రిగారు మాట్లాడుతూ వుంటే మీరిలా అల్లరి చేయటం బాగో లేదు." అని రాజుగారు చెబుతుంటే—

"మంత్రిగారు కూడా ఈ నాడు తమ జన్మదినపు వేడుకలను పాడుచేస్తూ, మర్యాద పాటించక అలా నోరు పారేసుకోటం బాగో లేదు" అన్నారు కొందరు ప్రజలు!

"కావచ్చు. కానీ వారు చెప్పినదానిలో నాకు చెడుగు వినిపించటం లేదు. మీరంతా శ్రద్ధగా వారు చెప్పేదికూడా వినండి. ఎవరు ఏది చెప్పినా సహనంతో విని, అందులోని నీతిని గుర్తించటం వివేకవంతుని లక్షణం. హితవును వినకపోవటం అవివేకి లక్షణం. కుటిలుడు బాగా అనుభవం పొందిన మేధావి. మీ అందరి తరఫున వారిని తమ ఉపన్యాసం కొనసాగించ వలసినదిగా ప్రార్థిస్తున్నాను." అన్నారు మృగేంద్రులు.

రాజుగారి వినయ బుద్ధికి అందరూ సంతోషించారు.

మళ్ళీ కుటిలుడు ఇలా అన్నాడు.

"నిజం చెబితే నిష్ఠూరంగానే వుంటుంది. మహారాజుగారు ఎంతో వివేకశీలి కనుక నేను చెప్పిన దానిని అపార్థం చేసుకోలేదు. మీకు బుద్ధీ, జ్ఞానమూ లేవు కనుక నా మీద విరుచుకు పడ్డారు" అన్నాడు కుటిలుడు.

అంతే. చాలామంది అక్కడి నుంచి లేచిపోయారు.

రాణీ గారికి కూడా కోపం వచ్చి తన పరిచారికలతో సహా వెళ్ళిపోయింది.

"మీరు మాట్లాడండి మేం వింటాం" అన్నారు మహారాజు.

మంత్రులూ కొందరు ప్రజలూ మాత్రం వున్నారు.

"మన మహారాజుగారు వృద్ధులై పోతున్నారు. వీరిలో వెనుకటి బలం లేదు. ఆరోగ్యంకూడా సరిగ్గా వుండటం లేదు. ఈ పరిస్థితిలో ఇంకా సింహాసనాన్ని అంటిపెట్టుకొని కూర్చుంటానని అంటే అది వారికి మంచిదికాదు. ఈవయస్సులో ఇంకా మన రాజుగారివల్ల మనం ఆశించేమేలూ లేదు. కాబట్టి వీరు మహారాజ పదవినుంచి వైదొలగి, అందుకు సమర్థులయిన వారిని మరొకరిని మహారాజుగా సింహాసనం మీద కూర్చోబెడితె ఎంతో బాగుంటుంది. రోజులు ఎప్పుడూ ఒకటిగా వుండవు. మన రాజుగారి బలహీనత తెలిసి పరాయి రాజు మనమీద దండెత్తితే ఏం చేస్తాం? లేదా ప్రజలే రాజుమీద తిరుగుబాటు చేస్తే అప్పుడు ఏం చేస్తాం? కాబట్టి మనం వెంటనే ఈ యదార్థాన్ని గుర్తించి ఒక నిర్ణయానికి రావటం మంచిది. ఎంత త్వరగా నిర్ణయం తీసుకుంటే అంత మంచిది" అన్నాడు కుటిలుడు.

అందరూ కుటిలుని ధోరణికి ముక్కు మీద వేలు వేసుకున్నారు.

"ఇది వేడుకగా మనం చేసుకుంటున్న ఉత్సవం. ఈ సందర్భంలో ఎంతో అసందర్భంగా ఆర్థిక మంత్రిగారు తమ భావాలు వ్యక్తం చేశారు. వారి మాటలలోని యదార్థాన్ని మంత్రి మండలి సభలో తప్పక నిర్ణయిస్తాం" అన్నారు అంతరంగిక మంత్రి అయిన భల్లూకపతి.

ఎంత ఉత్సాహంతో వచ్చారో అంత నీరసంగా ప్రజలూ, మంత్రులూ ఇండ్లకు వెళ్ళేరు. "పోయే కాలం దాపురించింది. అందుకే నక్క మంత్రి అలా వాగేడు" అనుకున్నారు కొందరు.

మహారాణిగారు కోపంతో రాజుగారి పుట్టినరోజు ఉత్సవ వేదికనుంచి సరాసరి తోక తొక్కిన తాచులాగా కోప గృహానికి వెళ్ళింది.

# 3

మృగేంద్రుడు రాజమందిరంలో ప్రవేశించాక ఎక్కడా రాణీగారు కని పించకపోయే సరికి కాస్త కంగారు పడ్డారు.

రాజుగారికి కోపం వస్తే ఫర్వాలేదు! రాణీగారికి కోపంవస్తే ఇంకేమైనా వుందా?

అంత మృగేంద్రుల వారూ ఇంత పిల్లిపిల్లలాగా అడుగులు వేస్తూ కోప గృహంలోకి వెళ్ళారు.

"ఎందుకు కోపం?" అడిగారు.

"ఎందుకా? ఆ కుటిలుణ్ణి అలా వాగనిచ్చినందుకు. శుభమా అని అందరూ సంతోషంగా వున్నప్పుడు మీరు చచ్చిపోవాలని కోరటానికి అతని కెంత గుండె వుండాలి. వేలెడు లేడు. ఒక మామూలు నక్క నలుగురిలోనూ మీ అంతటి సింహాన్ని పట్టుకొని అనరాని మాటలు ఎందుకనాలి? ఇదంతా మీరిచ్చిన అలుసు కాబోతే ఏవిటి? మిమ్మల్ని అవమాన పరచిన ఆ కుటిలుణ్ణి వెంటనే చంపేసి నాముందు పడేయండి! వాడి మాంసం తిని, వాడి రక్తం తాగేవరకూ నాకు నిద్రపట్టదు. అంతవరకూ నేనూ తలెత్తి తిరగలేను," అంటూ మండిపడింది రాణి!

"భగవంతుడు చల్లగా చూడాలిగానీ, ఒక నక్క నోరు పారేసుకుంటే మన కేం చెప్పు! అలాటి అల్పుని మీద చెయ్యి చేసుకోవటం నా అంత పెద్దవాడికి తగదు" అన్నాడు ప్రశాంతంగా రాజు.

"అంతేనంటారా! మనకు బిడ్డలు లేని సంగతి కూడా అతనికెందుకు చెప్పండి. నేను గొడ్రాలినని పదిమందిలోనూ ప్రచారం చేస్తుంటే మీరు కుక్కిన పేనులా ఎలా కూర్చోగలరు!

"అసలీరోజు ఉదయం నుంచీ నాకేవేవో పాడు శకునాలు కనిపించు తూనే వచ్చాయి. ఉత్సవానికి బయలుదేరుతుంటే నల్లపిల్లి ఎదురయింది. దూరంగా ఒక గుడ్లగూబ అరిచింది. వారిలో ఒక బాతు నీటిలో ఈదుతూ 'హాచ్' అనితుమ్మింది. ఏదో ఇలాటిదిఅవుతుందని అప్పుడేభయపడ్డాను" అంది కోపంగా.

"పిచ్చిదానా అడవి రాజ్యంలో పిల్లులు తిరగకుండా, గుడ్లగూబలు అరవ కుండానూ ఎలా వుంటాయి చెప్పు ?" అంటూ విరగబడి నవ్వేడు రాజుగారు.

"అవున్లెండి. నన్ను చూస్తే మీకు నవ్వుగానే వుంటుంది. ఇంతవరకూ నా కడుపున ఒక బిడ్డ పుట్టలేదే' అని నేను కుమిలిపోతుంటే, ఇప్పుడు నక్కలు నన్ను చూసి ఎగతాళి చేశాయి ! రేపు కుక లూ, కుందేళ్లుకూడా ఈ మహా



రాణిని చూసి నవ్వేరోజూ వస్తుంది. మీకు చీమ కుట్టినట్లు కూడా లేదు." అంటూ వల వలా ఏడ్చింది రాణి. తనకు జరిగిన అవమానాన్ని తలచుకుంటూ.

ఆమె విచారించటం చూసి మృగరాజూ విచారించాడు. అందులోనూ, తన పుట్టినరోజు పండుగనాడు పట్టపురాణి అలా దుఃఖించటం, పిల్లలు కలుగ లేదని బాధపడటం, ఆయనకూ బాధ కలిగించింది.

"దేవీ! చింతించకు. రేపే ఘనులైన జ్యోతిష్కులను పిలిపించి మనకు సంతాన ప్రాప్తి వుందో లేదో తెలుసుకుంటాను. కుటిలుని మీదకూడా ఒక చూపు వేసి వుంటాను. చెడిపోయేవాణ్ని ఎవరూ బాగుపరచలేరు. బాగుపడే వాణ్ని ఎవరూ చెడగొట్టలేరు. కుటిలుని మాటలు మరిచిపో. మామూలుగా ఆనందంగా వుండు" అంటూ ప్రాధేయపడ్డాడు మహారాజు.

"అంతే కాదు. కుటిలుణ్ణి నమ్మటానికి వీల్లేదు! గుంటల్లో పాతిపెట్టిన కళేబరాలను బయటకు తవ్వి, ఎండు బొమికలు తినే నక్క జాతి కుటిలుడిది. వాడు మీ రాజ వంశానికే ఏదో కీడు తలపెట్టకపోతే అలా మాటాడడు.

"ఎవరిని ఏ స్థానంలో వుంచాలో వారిని అక్కడే వుంచాలి. లేకపోతే కుటిలునికి మంత్రి పదవి ఇచ్చి మీరు సాధించే దేమిటి ? అతనికంటె తెలివిగల వాడు మీ రాజ్యంలో ఎవరూ లేకనా అతనికి మంత్రి పదవి ఇచ్చారు ? తెలివి గల వారినీ, వివేక వంతులనూ గుర్తించి గౌరవించక, బుద్ధిహీనులనూ, అవి వేకులనూ అధికారంలోకి తెచ్చే మీ పరిపాలనలో మీకే కీడు జరుగుతుంది" అంది రాణిగారు.

"కుటిలునిలో నీవు ఊహించిన దురాలోచనలు ఏవైనా కలిగితే అవి అతనినే నాశనం చేస్తాయి. మంచి ఆలోచనలూ, మంచి మాటలూ, మంచి చేతలూ, మంచివారికి సహజంగానే అలవడుతాయి. చెడ్డ ఆలోచనలూ, చెడు

మాటలూ, చెడు చర్యలూ ఎవరినైనా చెడగొడతాయి. కానీ మనసులో, మాటలో, చేతలో ఒకటిగా వుండటం వివేకి లక్షణం. కుటిలునిలో ఈ వివేకం లేదు. అతని అవివేకం అతన్నే నాశనం చేస్తుంది" అన్నారు రాజుగారు.

# 4

మృగరాజు పేరు 'సమవర్తి' కదా !

ఆయన పేరుకు తగిన వాడు.

కష్టంలో కలత చెందడు. సుఖంలో సొక్కిపోడు. సంతోషంతో పొంగిపోడు. దుఃఖంతో కుంగిపోడు.

నేరం చేసికూడా పశ్చాత్తాపం చెందితే, అలాటి వారిని ఆయన ఏమీ చేయడు. శిక్ష అనేది నేరం చేసిన వాణ్ణి మంచి దోవకు తిప్పేదిగా వుండాలని ఆయన అంటారు.

కుటిలుడు ఆరోజున మాట్లాడిన మాటల్లోని యదార్థాన్ని గురించి చర్చించటానికి మంత్రిమండలి అత్యవసర సమావేశం ఏర్పరచారు మహారాజు. మంత్రులందరికీ 'రాజపత్రం' ద్వారా ఈ సంగతి తెలియజేశారు. మంత్రులందరూ రాజపత్రాన్ని చదివి సంతకం చేసి పంపించారు. కుటిలుడు మాత్రం కుటుంబంతో సహా ఇంట్లో లేకుండా ఎటో వెళ్ళిపోయాడు. అతడి జాడ రాజుగారికి తెలీలేదు.

తరచుగా మంత్రులు ఏవో ప్రారంభోత్సవాలకూ, ఆవిష్కరణ ఉత్సవాలకూ వెళ్తూవుంటారు. అలాటి పని ఏదైనా తగిలిందేమో అనుకున్నాడు మహారాజు.

సమావేశం వేళ్టికి మంత్రులందరూ వచ్చారు.

ఒక్క కుటిలుడే రాలేదు. అయినా సమావేశం జరగటానికి అవసరం అయినంత మంది మంత్రులు వచ్చారు. కనుక సమావేశం జరిగింది.

రాజుగారి అంతరంగిక మంత్రి భల్లూకపతి సమావేశానికి గంట ముందు గానే వచ్చి ఏర్పాట్లు పూర్తి చేశాడు.

రక్షణ మంత్రి వ్యాఘ్రేశ్వరుడు, న్యాయశాఖ మంత్రి మహా వృషభుడు, శాంతి భద్రతల మంత్రిణి కపోతేశ్వరి, విద్యామంత్రి రాజహంస సమయానికి వచ్చారు. వాణిజ్య ఆర్థిక వ్యవహారాల మంత్రి కుటిలుడు ఒక్కడే రాలేదు.

"కుటిలుడు ఎందువల్ల రాలేదు ?" అని ప్రతి ఒక్కరూ ఆలోచించ సాగారు.

"రాజుగారి పుట్టినరోజు ఉత్సవంలో అలా నోరు పారేసుకున్నందుకు ముఖం చూపించటానికి మనసు చెల్లలేదేమో !" అన్నారు ఒకరు.

"అతడు మాట్లాడిన దాంట్లో తప్పేముంది ? జరగబోయే సంగతి తెలియ జేసాడు."

"అలా చెప్పటానికికూడా సందర్భం చూడవద్దా ?"

ఇలా మంత్రులు అనుకుంటూ వుండగా రాజుగారు సభకు వచ్చారు. అందరూ గౌరవ సూచకంగా లేచి నిలబడి వారికి స్వాగతం చెప్పారు.

"కుటిలుడు రాలేదే ?" అనుకున్నాడు.

"ఈ రోజున జరిగే మంత్రి మండలి సమావేశంలో ఒక ముఖ్యమైన చర్చ జరగాలి" అన్నారు మృగేంద్రులు చాలా గంభీరంగా.

అందరూ ఆసక్తితో వింటున్నారు.

"నేను మహారాజ పదవిలో వుండాలా ? లేకపోతే కుటిలుడు చెప్పినట్లుగా

సింహాసనం దిగి వేరొకరికి అధికారం వప్పగించి వెళ్లిపోవాలా ? ఏం చేయ మంటారు," అని ప్రశ్నించారు మృగేంద్రులు.

"ఇది మీ అందరి భవిష్యత్తునూ కోరి అడుగుతున్నాను ! మీరు నిర్భయంగా, నిర్మొగమోటంగా మీ మీ అభిప్రాయాలు చెప్పాలి. నేను పదవి నుంచి దిగి పోవటం వల్ల ప్రజలకు మేలు జరిగితే, ఈ క్షణంలోనే అలాటి మంచి పని నెరవేరుస్తాను." అన్నారు మృగేంద్రులు.

అందరికీ చాలా బాధ కలిగింది.

ప్రజలను కన్నబిడ్డల వలె పాలించే రాజు పదవిని వొదులు కోవటమా !

నేరస్థులలో కూడా మంచి నడవడిని కలిగించి వారిని మంచి పౌరులుగా తీర్చిదిద్దే సహన శీలుడు, ధర్మ ప్రభువూ అధికారం వదులు కోవటమా !

ప్రజల సుఖమే తన సుఖంగా ఎన్నో సంవత్సరాలు పరిపాలించిన అనుభవ శాలి అయిన పరిపాలకుడు గద్దె దిగి పోవటమా !

మంత్రి మండలిని అంతటినీ ఒక గీత మీద నిలిపి, ప్రజల కష్టసుఖాలు తెలుసుకుంటూ, ప్రజలందరిలోనూ సమైక్య భావం కలిగించిన నాయకుడు తన నాయకత్వాన్ని వదులు కోవటమా !

ఇంతకంటె దేశానికి దుర్గతి వేరే వుందా ?

ఇంత కంటె ప్రజల దౌర్భాగ్యానికి కారణం వుందా ?

ఇంత కంటె జాతికి కీడు ఇంకోటి వుంటా ?

— ఇలా ప్రతి ఒక్కరూ ఆలోచించుకో సాగారు.

"మీరు ఇలా మౌనంగా కూర్చుంటే నేనూ చూస్తూ కూర్చోటానికి రాలేదు. మీరు ఈ సమస్యను గూర్చి చర్చించాలి. ముందుగా భల్లూకపతి మాట్లాడాలి" అంటూ రాజుగారు ఆజ్ఞ ఇచ్చారు.

"మహారాజా ! ఎవడో ఒక వాచాలుడు ఏదో వాగినందుకు మీరు ఈ రీతిగా ఈనాడు సమావేశం ఏర్పాటు చేశారు. మా అభిప్రాయానుసారం తాము పదవిలో వుండటం, పదవి నుంచి దిగి పోవటం నిర్ణయించాలని అనుకున్నారు.

"ఇంతకంటె ప్రజల క్షేమం కోరే బుద్ధి ఇంకా ఎవరికుంది చెప్పండి ! ఒక వేళ ప్రజా క్షేమం కోరే వారు వున్నావారికి బుద్ధిబలం, భుజబలం రెండూ వుండాలి కదా ! ఎంతో కాలం నుంచీ ఈ అడవిలోని జంతువు లన్నింటికీ సింహమే మృగేంద్రుడనే ఖ్యాతిని నిలబెట్టుకుంది. కనుకనే మీరు మా అందరికీ ప్రభువులై ప్రజలను సుఖింప జేస్తున్నారు ! ఈనాడు మీరు సింహాసనం దిగి పోయి రాజ్యాధికారం ఎవరికో వదిలి వేయటం వల్ల ఈ దేశానికి అరిష్టం జరుగు తుంది ! మీరు నిజంగా ప్రజల క్షేమాన్ని కోరితే, మీ పరిపాలనాధికారాన్ని ఇలాగే సాగించండి." అని ప్రార్థన పూర్వకంగా విన్నవించాడు. భల్లూకపతి!

"మహారాజా ! విద్యవల్ల వినయం వస్తుంది అంటారు. మీకు గల వినయం, వివేకం చదువుకున్న విద్య వల్ల రాలేదు. మీ పుట్టుకతోనే అవి కలిగాయి. అలాటి సహజ వివేక సంపన్నులు ప్రజల కష్టసుఖాలను సరిగ్గా తెలుసుకోగలరు. కాబట్టి మీరు ప్రభువులుగా కొనసాగ వలెనని నా మనవి. అంతేకాదు ! ఎవరు పరిపాలిస్తున్నారు అనేది ముఖ్యం కాదు ప్రజలకు. ఎలా పరిపాలిస్తున్నారు అన్నదే ప్రధానమైన అంశం ! మీ పరిపాలనలో ప్రజలు విద్యావంతులై వివేకవంతులై సుఖజీవనం చేస్తున్నారు. కాబట్టి మీరే మాకు ప్రభువులుగా ఇకమీద కూడా వుండండి." అని ప్రార్థించారు విద్యా మంత్రి అయిన రాజహంస !

"ప్రభూ ! శాంతి భద్రతలు ప్రజలకు సమకూర్చటమే పరిపాలకుల చివరి ఆదర్శం ! ప్రస్తుతం ప్రజలంతా తమ కష్టార్జితాన్ని తాము న్యాయంగా ధర్మ బద్ధంగా పొందుతూ వున్నారు ! ఒకరి సొత్తును ఒకరు ఆశిస్తూ, దురాశాపరులై

శాంతి భద్రతలకు భంగం చేయటం లేదు మన ప్రజలు. వారికి మీరు చెబితే చాలు, ఎంతో గౌరవంతో లేచి నిలబడతారు. మంచి వారికి మీరు ధర్మ ప్రభువులు. దుర్మార్గులు ఎవరైనా వుంటే వారికి మీరు యమధర్మరాజులు! అలాటి మీరు ఇంకా చాలా కాలం మీ ప్రజలను పరిపాలించ వలసిన అవసరం ఎంతో వుంది," అన్నది శాంతి భద్రతల మంత్రిణి కపోతేశ్వరి.

"మహారాజా! మీకు గల శౌర్య పరాక్రమాలను నేను వివరించటం సూర్యుడంతటి వాణ్ని, దీపంతో చూపించటం వంటిది. మీ పేరు చెవిన పడితేనే ఎన్నెన్నో క్రూర జంతువులు కూడా హడలిపోతాయి. ఏనుగంత పెద్ద జంతువుకు మీరు కలలో కనిపించినాసరే అది కాస్తా ప్రాణంవిడుస్తుంది. అలాటి మీరు మాకు ప్రభువులుగా వుండటం మా భాగ్యం! గర్వకారణం కూడా, అన్నాడు రక్షణమంత్రి అయిన వ్యాఘ్రేశ్వరుడు.

"ప్రభూ! మీ పరిపాలనలో న్యాయం అక్షరాలా అమలులోకి వస్తోంది. న్యాయశాఖ, శాంతి భద్రతల శాఖ, రక్షణశాఖ కలసి చక్కగా పని చేస్తున్నాయి. ధర్మం నాలుగు పాదాల మీదా నడుస్తోంది. కాబట్టి మీరు మీ న్యాయపాలన కొనసాగించక తప్పదు. ప్రజలు అన్యాయంగా, అధర్మంగా ప్రవర్తిస్తే ఆ పాపం ఆ బాధ్యత మహారాజుదే అవుతుంది! యథారాజా తథాప్రజా అన్నారు. మీ న్యాయ సమ్మతమైన పద్ధతులనే ప్రజలూ అనుసరిస్తూ రాజుకు తగిన ప్రజలుగా వుంటున్నారు." అన్నాడు న్యాయశాఖ మంత్రి మహా వృషభుడు.

"అయితే నామీద మీ అందరికీ గల మంచి అభిప్రాయానికి నా కృతజ్ఞతలు! మీరు అంతా కలసి నన్నే రాజుగా వుండవలసిందిగా ఆదేశిస్తున్నారు. కానీ నా వయస్సునూ, నా స్థితినీ మీరు ఎంచ లేదు. నేను ముసలివాణ్నయి పోతున్నాను. నేనూ ఏదో ఒక రోజున ఈ వృద్ధాప్యానికి తలవంచి శాశ్వతంగా

కనులు మూసుకోవలసిన వాణ్ణే! అప్పుడు మీరేం చేస్తారో చెప్పండి." అని సూటిగా ప్రశ్నించాడు మృగేంద్రుడు.

ఇదే ప్రశ్నను కుటిలుడు కూడా వేశాడు!

"ప్రభూ! మీ తర్వాత మీసంతతి తప్పక మహారాజ పదవిని అలంకరిస్తారు. అలా అనుగ్రహించాలని భగవంతుని ప్రార్థిస్తాం. అంతే తప్ప మరో విధంగా వూహించలేం," అన్నారు మంత్రులు.

అంతటితో సమావేశం ముగిసింది.

## 5

మృగేంద్రుల వారి ఆదేశం ప్రకారం జ్యోతిష్కులు వచ్చారు.

వారు ఏం చెబుతారోనని రాజమందిరంలోని వారందరూ ఆదుర్దాతో ఎదురు చూస్తున్నారు.

"మృగేంద్రులకు జయము జయము" అంటూ ఇద్దరు జ్యోతిష్కులు రాజుగారికి అభివందనం చేశారు.

జాగ్రత్తగా మృగేంద్రుల వారి జాతకాన్నీ, రాణీగారి జాతకాన్నీ పరిశీలించారు వారు. చేతుల్లోని గీతలను కూడా జాగ్రత్తగా చూశారు.

"మహారాజా! మీకు సుపుత్రుడు ఒకే ఒకడు పుడతాడు. మీ వంశం నిలుస్తుంది మీ తర్వాత మీ పుత్రుడే సింహాసనం ఎక్కుతాడు." అని చెప్పారు జోతిష్కులు.

రాజుగారూ, రాణీగారూ ఎంతో సంతోషించారు.

"మహారాజా! రాజకీయంగా మీకు శాంతి లేకుండా పోతుంది కళత్ర స్థానంలో మీకు ఎంతో అశాంతి కూడా రాసిపెట్టి వుంది. దుష్టగ్రహ శాంతికి

పూజలు చేయించుతూ, తగు జాగ్రత్తతో వుండండి" అని రహస్యంగా రాజు గారికి చెప్పారు.



ఆ జ్యోతిష్కులను సంతృప్తి పరస్తూ వస్తువులూ, నగలూ, బంగారమూ ధనమూ ఇచ్చి పంపించాడు మహారాజు.

పిల్లవాడు పుడతాడనే సంతోష వార్త విన్న రాణీగారు రాజ్యం అంతటా బీదసాదలకు అన్నదానం చేయించింది. దేవాలయాలలో పూజలు ఉత్సవాలూ చేయించింది.

ఈ శుభవార్త దేశం అంతటా వ్యాపించి, చివరకు కుటిలుడి చెవిని కూడా

పడింది. అయినా రాజుగారి కంట పడితే తాను పలికిన ప్రగల్భాలకు అతడు కోపించి ఏం శిక్ష విధిస్తాడోనవే భయంతో రహస్యంగా ఎక్కడో తిరుగుతూ, లేదా ఇంట్లోనే వుంటూ కాలక్షేపం చేస్తున్నాడు.

రాజులకు ఆగ్రహం వచ్చినా అనుగ్రహం వచ్చినా భరించటం కష్టమే అవుతుంది!

రాణీగారికూడా తన మీద ఎంతో కోపం కలిగిందని కూడా అలా అలా కుటిలుడికి తెలిసింది. ఒంట్లో సరిగ్గా లేదని ఒక్కొకసారి ఇంట్లోనే ముసుగుతన్ని పడుకొనేవాడు. ఆర్థిక శాఖకు సంబంధించిన కాగితాలు ఏవైనా వుంటే, వాటి మీద మంత్రిగారి క్రింద పనిచేసే అధికారులే తగిన చర్య తీసుకుంటూ, కేవలం సంతకం కోసం మంత్రిగారి యింటికి, ఆ కాగితాలను పంపిస్తూ వుంటే కుటిలుడు వాటి మీద ఒక గుడ్డి సంతకం పారేసి కూర్చుంటున్నాడు!

ఎంత కాలం ఇలా అవస్థపడాలో అతనికే తెలీని స్థితి వచ్చింది. పోనీ రాజు గారి ఎదుటకు పోయి క్షమార్పణ కోరుకుందామా అంటే అభిమానం, అసూయ అడ్డం వస్తున్నాయి. ఒకవేళ పశ్చాత్తాప పడి రాజు ఎదుట పడినా, రాణీగారు బ్రతక నిస్తుందని నమ్మకం కుదరటం లేదు.

"రాజీనామా చేస్తే హాయిగా వుంటుంది. మీ బాధ చూడలేక పోతు న్నాను. మీ మొహం చూసి ఎవ్వరూ మంత్రి పదవి ఇవ్వరని నాకు తెలుసు. అయినా రాజుగారు ధర్మాత్ముడు కాబట్టి మీకుగల తెలివి తేటల్ని చూసి మంత్రి పదవి ఇచ్చాడు. పదవి అయితే వచ్చిందిగానీ, దాన్ని నిలబెట్టు కోవటం చేత కావొద్దూ! మీ రెంత, మీ కాహ తెంత? అందులోనూ....అవ్వ...ఆ పుట్టినరోజు పండుగనాడే అలా మాట్లాడేరే! మీకు చెడు రోజులు దాపురించబట్టే అలా చేశారు. ఇంతకూ నా ఖర్మ! నా మొగుడు మంత్రిగారయ్యారని తోటివారిల్లో ఎంతో విర్రవీగుతూ తిరిగేను. మీ బుద్ధి తక్కువ పనికి మీ మంత్రి పదవి వూడ

నవ్వొ వూడాలి, అసలు మీ ప్రాణాలయినా పోవాలి! రాణీగారు తలచు కుంటే మీరెంత చేస్తురు! మీ పదవి ఎంత చేసును! ఓయిదేవుడా, మంత్రి పదవి పోతే పోయింది. మావారి ప్రాణాలయినా నాకు దక్కించు. నా మంగళ సూత్రం కాపాడు," అంటూ వలవలా ఏడ్చింది కుటిలుడుగారి భార్య!

ఆవిడ గోలతో ఇంట్లో వుంటే నరకంగా వుంది. బయటకు పోతే, రాజుగారి కంటపడితే చావే రాసిపెట్టి వుంది. "ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటే ఈ పీడ వదిలిపోతుంది," అనుకుని బాధపడ్డాడు కుటిలుడు!

"ఛీ! ఇంత బతుకూ బతికి చచ్చిపోవాలని కోరుకోవటం అవివేకం! ఏ ఎండకు ఆ గొడుగు పడుతూ, ఎటు గాలివీస్తే అటు వైపు మొగ్గుతూ, ఎదుటి వాడి తలలు మార్చటంలో ఎంతో నేర్పు గడించిన వాడనై, నమ్మించి మోసం చేయటం అనే విద్యలో పట్టభద్రుడనై, జిత్తులమారి వేషాలలో అందరినీ తల దన్నినవాడనై, నా తలలో ఏ ఆలోచనవుందో నన్ను పుట్టించిన బ్రహ్మకు కూడా తెలియనీయని తెలివి కలవాడనై ఇలా బెదిరి పోవటం నాజాతికే తీరని అవ మానం, నా వంశానికే తీరని అవమానం, నాకే తీరని అవమానం!

"కనుక ధైర్యం తెచ్చుకొని ఏదో విధంగా తిరిగి రాజుగారి మెప్పు పొందుతాను. వారి అభిమానం సంపాదించి, నా పలుకుబడీ పరపతీ పెంచి చివరకు ఎలాగయినా వారిని నమ్మకం మీద మోసం చేయకపోతే నా పేరు కుటిలుడు కాదు.

"అంతేకాదు. ఈయన ఎక్కువ రోజులు ఎలాగూ బతకడనే నా విశ్వాసం. ఇప్పుడు రాణీగారికి పిల్లలు పుడతారనే సంగతి అందరూ చెప్పుకుంటున్నారు! ఏవో మాయోపాయాలతో, ఆమెకు ఒకవేళ కడుపువస్తే, ఆ కడుపు కాస్తా పోయేలా చేయాలి! అదీ నావల్ల కాకపోతే కనీసం ఆమెకు కలిగిన బిడ్డనయినా ఏదో విధంగా చంపేసే ప్రయత్నం చేసి రాజుగారికి వారసుడు లేకుండా

చేయాలి. అది నెరవేరితే, రాజు చచ్చిన తర్వాత నాకు నచ్చిన ఒక గంగిరెద్దు వంటి వాణ్ని సింహాసనం మీద కూర్చోబెట్టి, సమస్త రాజ కార్యాలన్నింటినీ నేనే చేతి చిక్కించుకుని నా అధికారం, నా హోదా, నా సుఖం, నా సంపద అంతు లేకుండా పెంచుకొని నేనే కిరీటంలేని చక్రవర్తిగా సంచరించాలి" అనుకున్నాడు కుటిలుడు. అందుకు తగినట్టుగా ఆలోచిస్తూ అవకాశాల కోసం ఎదురు చూడటం ప్రారంభించాడు కుటిలుడు! 

## 6



ఒకరోజు మహారాణిగారూ చెలికత్తెలూ కలిసి వన విహారం చేయటానికి వెళ్లారు.



చూడటానికి ఎంతో ముచ్చటగా వున్న ఒక పూల తోటలో పూల తీగెల వుయ్యాలలు ఎక్కి విహరించారు. చెలికత్తెలంతా రాణీగారిని ఎంతో సంతోష పరిచారు. రకరకాల పూల దండలూ అల్లి ఆమె మెడలో వేశారు. ఆమెను అందంగా అలంకరించారు.

ఆమెకు ఆనందం కలగటం కోసం ఒక చెట్టుకు వుయ్యాల కట్టి, అందులో ఒక చిన్న రాయిని వుంచి, వూగిస్తూ జోలపాటలు పాడుతూ "రాణీగారికి పిల్లవాడు పుడతాడు. ఆ యువరాజా వారిని ఇలాగే మనం వూయెల్లో వుంచి వూగించాలి," అనుకున్నారు, చెలికత్తెలు.

ఇంకో చెలికత్తె "యువరాజా వారికి ఆకలి, వేస్తోందే పాలివ్వండే. ఆలస్యం అయితే రాణీగారు కోప్పడతారు," అంటూ భయపడుతున్నట్లు నటిస్తూ బిడ్డకు పాలిస్తున్నట్లుగా అభినయించింది.

ఇంకో చెలికత్తె "ఒసే దాసీదానా! యువరాజా వారికి స్నానాల వేళ అయిందే. బాల యువరాజా వారిని స్నానాల గదిలోకి తీసుకురండే నీళ్లు పోస్తానూ," అంటూ అరిచింది.

"అమ్మమ్మో! బాల యువరాజా వారు గుక్కపెట్టి ఏడుస్తుంటే మీరంతా ఇలా నిద్ర పోతున్నారుటే. మీ పని పట్టిస్తాను చూడు. రాణీగారితో చెప్పి మీ తిక్క కుదురుస్తాను చూడు," అంటూ ఇంకో చెలికత్తె పిల్లవానిని ఆడిస్తూ ఏడుపు మాన్పుతున్నట్లుగా నటించింది!

ఈ రీతిగా రాణీగారికి సంతోషం కలిగేలా వారంతా ఆ పూలతోటలో తమాషాగా ఆటలు ఆడుకున్నారు.

"ఒకవేళ రాణీగారికి మగబిడ్డ పుట్టక ఆడపిల్ల పుడితేనో," అంది ఒకతె.

"కాదు మగబిడ్డే పుడతాడు"

"కాదు ఆడపిల్ల."

"ఏం పందెం?"

"గుద్దు గుద్దు పందెం" అంటూ ఒక చెలికత్తెను అందరూ కలసి తమాషాగా వీపు మీద దెబ్బలు వేశారు.

"వుండండి రాణీగారితో చెప్పి మీ పొగరు అణిగిస్తాను." అంటూ అది తప్పించుకు పారిపోయింది.

ఇలా చాలాసేపు గడిచాక ఆ తోటకు దగ్గరలోనే వున్న ఒక చక్కని చెరువు దగ్గరకు పోయారు.

ఆ కొలనులో ఎన్నో పద్మాలు వికసించి ఎంతో కనుల పండువుగా కనిపించుతున్నాయి.

"ఈ కొలనులో స్నానం చేదాం. తర్వాత తిరిగి వెళ్దాం" అనుకున్నారు అంతా!

"చెరువులో దిగి ఎన్నెన్నో ఆడుకోవచ్చు. ఈతలు కొట్టవచ్చు. మునిగి పోయి కనిపించకుండా ఒకరిని ఒకరు తాకుతూ ఆడుకోవచ్చు. ఒకరి వీపుమీద

ఇంకొకరు ఎక్కి తేలిపోవచ్చు, ఈదవచ్చు," అనుకున్నారు రాణీగారి అంతఃపుర స్త్రీలు. అందరూ చాలా సరదాగా వున్నారు.

ముందు చెరువులోకి ఎవరు దిగాలి ?

"నువ్వు దిగవే అంటే నువ్వు దిగవే" అంటూ ఒకరిని ఒకరు నీళ్ళలోకి తోసుకోవటం ప్రారంభించారు.

ఇంతలో ఒక చెలికత్తె నీటిలో అడుగు పెట్టబోయే సమయంలో — ఒక మెరుపులాగా వచ్చి పడ్డాడు కుటిలుడు !

అందరు అంతఃపుర కాంతలు వన విహారం చేస్తూ వుండగా, అందులోనూ జలక్రీడలకు తయారయి వుండగా ఒక మగవాడు వారి మధ్యలోకి రావటం అందరికీ అవమానం జరిగినట్లు అనిపించి విస్తుపోయి నిలబడ్డారు !

"మీరు ఆ కొలను నీటిలో అడుగు పెడితే నేను సహించలేను. మీరు ఆ కొలనులో దిగితే నేను చూస్తూ కూర్చోలేను. ముందు మీరంతా ఇవతలకు వచ్చి మీ మందిరానికి వెంటనే వెళ్ళిపోండి," అంటూ చాలా గట్టిగా అరిచాడు కుటిలుడు !

"ఇంతమంది రాజాంతఃపుర స్త్రీలు ఏకాంతంగా క్రీడిస్తూ వుంటే ఒక మగవాడు ఇక్కడకు రావటానికి ఏం అవసరం వుంది ! అలా తెగించి ప్రవర్తించటానికి నీకు ఎన్ని గుండె లుండాలి ! ఇందుకు తగిన శిక్షను అనుభవిస్తావు," అంటూ ఎంతో అవమానంతో రాణీగారు కుటిలుని మీద అరుస్తూ, నిప్పుల వర్షం కురిపించింది !

అక్కడ నుంచి కుటిలుడు వెంటనే పారిపోయాడు !

"మృత్యువుతో చెలగాటం ఆడుతున్నాడు కుటిలుడు. రాజుగారి పుట్టిన రోజు పండుగ నాడు అలా ప్రవర్తించి రాజును అవమాన పరిచాడు. ఈ నాడు

రాణీగారిని ఇలా అవమాన పరిచాడు. వీడికి నిజంగా చచ్చే రోజు వచ్చింది," అనుకున్నారు అందరూ !

రాణీగారు మహాకాళి వలె అంతఃపురం చేరింది. చెలికత్తె లందరూ ఏడుస్తున్నారు.

రాణీగారు తన వొంటి మీదగల నగలన్నింటినీ విసిరి పారేసింది.

చేతికి అడ్డం వచ్చిన వస్తువులూ, కాలికి అడ్డం వచ్చినవీ ఒక్కో విసురుతూ అంత దూరాన ఎగిరి పడుతున్నాయి.



"ఏం జరిగింది ?" అంటూ ఆదుర్దాగా వచ్చారు మృగేంద్రులు.

"మహారాజా ! రాణీగారికి నెల తప్పింది కదా ! ఇప్పుడు రాణీగారు ఎంతో సంతోషంతో వుండవలసిన సమయం కదా !" అంటూ ఉపోద్ఘాతం ప్రారంభించింది ఒక చెలికత్తె !

"అబ్బబ్బ ! ముందు నీ ఉపోద్ఘాతం తగ్గించి అసలు ఏం జరిగిందో వెంటనే చెప్పు!" అని అరిచారు రాజాగారు.

కుటిలుడు తమ ఏకాంత విహారాన్ని ఎటువంటి సమయంలో భంగ పరిచిందీ పూస గుచ్చినట్లు చెప్పింది ఆ చెలికత్తె. రాణీగారి సంతోషాన్ని ఎలా పాడు చేసిందీ చెప్పింది !

"జరిగిన అవమానం చాలు. నలుగురికీ చెప్పి నగుబాట్లు పాలు కావటం దేనికే ! మన మహారాజులు ధర్మాత్ములు ! ఆ నాడు వారికి అవమానం జరిగింది. అందుకు శిక్షించక విడిచి నందుకు ఈ నాడు ఎండ కన్ను ఎరగని రాణీగారికే అవమానం జరిగింది. రాజావారికి మానావమానాలు రెండూ సమానమే ! ఈ అవమానాన్ని మనకు మనమే ఎవ్వరితోనూ చెప్పుకో కుండా దిగ మింగి సిగ్గూ ఎగ్గూ లేకుండా బ్రతుకుదాం ! మన కర్మ ఇలా వుంది" అంటూ విచారించింది రాణీగారు.

"కుటిలుడు ఇలాటి సాహసానికి పాల్పడ తాడని కల్లో కూడా వూహించ లేక పోతున్నాను. రేపే న్యాయ సభలో కుటిలునిపై ఈ అభియోగం మోపి, నీ చెలికత్తెల సాక్ష్యాన్ని ఆధారంగా తీసుకుని నేరస్థుడుగా నిరూపించుతాను. కుటిలునికి పెరిగిన కండ కావరాన్ని నాశనం చేస్తాను. అతడికి మరణశిక్ష విధిస్తాను," అంటూ మృగేంద్రులు ప్రతిజ్ఞ చేశారు.

మహారాజుల వారి సంకల్పాన్ని ఎవరూ కాదనలేరు! అది అందరికీ తెలుసు.

"రేపి పాటికి శని విరగడ అవుతుంది. కుటిలునికి మరణశిక్ష విధిస్తారు. రేపు రాత్రికి ఆ నక్కగాడి తోకతో కాళ్లతో చేతుల్తో వుడికించిన పులుసు వేసుకోవచ్చు. వాడికి కండలు బలిసి కొట్టు కుంటున్నాడు. ఆ కండలు కోసి చేసిన కూరతో కడుపు నింపుకోవచ్చు. వాడి తల పగలగొట్టి పచ్చడి చేసి మజ్జిగలో నంచుకో వచ్చు," అనుకున్నారు చెలికత్తెలు.

ఎలా పాకిందో ఈ సంగతి అందరికీ తెలిసి పోయింది. అందుకే గోడలకు చెవులుంటాయని అంటారు!

కుటిలుడంటే అసహ్యించుకొనే వారంతా ఎంతో సంతోషించారు. "వాడి పొగరు, వాడి తలబిరుసు ఇంత పని చేశాయి. ఈ దెబ్బతో వాడి ప్రాణం హరీ అంటుంది; అనుకున్నారు వాళ్లు. కొందరు జాలిపడ్డారు. అతనికి కొందరు అభిమానులూ వున్నారు.

"రాత్రికి రాత్రి ఎటైనా దూరంగా పారిపో. ఈ రాజ్యం వదిలి వెళ్లు. లేక పోతే నిజంగా చస్తావు," అన్నారు అతని శ్రేయోభిలాషులు.

"ఏమండీ! ఖుడిచి కూర్చోక ఇవేం పనులండీ! లక్షణంగా తాళి కట్టిన ఇల్లాలిని ఇంట్లో పెట్టుకొని నలుగురు బిడ్డలకు తండ్రి అయి వుండీ, అలా రాణీ గారి జలక్రీడలు రహస్యంగా చూసేటంత తెంపరి తనం మీలో ఎలా కలిగిందండీ! అలా అంతమంది ఆడవాళ్ళ ఎదుటపడి 'మీరు స్నానాలు చేస్తూ వుంటే నేను చూస్తూ కూర్చోలేను' అని వాళ్ళను ఇంటికి తరిమి వేసేటంత ధైర్యం ఎలా వచ్చిందండీ! మీకు ఇలాంటి చావుతెలివి తేటలు పుట్టా ఏమండీ! మమ్మల్ని చంపి పారేసి ఇలాటి పనులు చేసి మీరూ చస్తే బాగుంటుంది గానీ

నన్నూ నలుగురు బిడ్డలనూ అన్యాయంగా వదిలేసి రేపు రాజ శిక్షకు పాత్రులై మీరే చస్తే ఎలాగండీ," అంటూ విలావిలా ఏడ్చింది అతడి భార్య! అతడి బిడ్డలూ ఏడ్చారు!

"ఓసేవ్! ఎందుకే అలా ఏడుస్తావ్" అన్నాడు కుటిలుడు.

"ఏడవటం కాదు. నిజంగా చావాలి! చావలేక ఏడుస్తున్నా"

"ఏడవటం కాదు, చావటం కాదు. నిజంగా మనం ఇంటిల్లిపాదీ ఈ పూట నవ్వాలి! ఆనందంగా వుండాలి!"

"రేపు మీరు చావబోతుంటే నన్ను ఈ పూట నవ్వుతూ వుండమంటున్నారా! ఆనందించమంటున్నారా!" ఆశ్చర్యంగా అంది!

"ఆనందించటం కాదే పిచ్చిదానా! మడికట్టుకొని విందు భోజనం చేయవే! వూఁ. లే," అన్నాడు.

"నిజంగా మీకు పిచ్చి ఎత్తింది. మతి తప్పింది. అందుకే ఇలా చేస్తున్నారు. నన్ను ఏడిపించుతున్నారు! మొగుడు ఒక ప్రక్క రేపటి రోజున చస్తాడని తెలిసి ఏ ఇల్లాలయినా విందు భోజనం చేస్తుందండీ—మీకు మతి తప్పింది! అయ్యో బాబోయ్! అయ్యో దేవుడోయ్! ఈ మతి తప్పిన మొగుడుతో పెద్ద చావే వచ్చింది దేవుడోయ్," అంటూ శోకం పెట్టింది ఆ యిల్లాలు.

ఇదివిన్న అతని మిత్రులు అతన్ని రక్షించటానికి ఒక ఉపాయం ఆలోచించారు.

"మహారాజా! కుటిలునికి ఈ మధ్య మతి తప్పింది. పిచ్చివాడయిపోయాడు. అందువల్లనే ఇలాటి రాజద్రోహులను చాలా ధైర్యంగా ఒకదాని తర్వాత ఒకటి పారేస్తున్నాడు. పిచ్చివాళ్ళు నేరం చేసినా అది నేరం కాదు. ఈ

ధర్మ సూక్ష్మం క్రింద కుటిలుడు రాజద్రోహం చేసినా అతడు శిక్షార్హుడు కాడు. వీలినవారు ఇతన్నీ, ఇతని ఇల్లాలి కన్నీటినీ, ఇతడి బిడ్డల ఆర్తనాదాన్ని చూసి అయినా విడిచి పుచ్చాలి. ఈ పిచ్చివాణ్ని తమరు క్షమించాలి," అని అందరం రాజుగారిని ప్రార్థించుదాం అన్నారు వాళ్ళు !

"అలాగే చేయండి బాబూ! నా పసుపు తాడు నిలబెడితే చాలు. మా అయనకు మంత్రి పదవీ వద్దు, మట్టిగడ్డలూ వద్దు! బ్రతికి బయట పడితే ఈ పిచ్చి మొగుడితో ఎలాగో కాపరం వెలగబెడతాను బాబూ," అంది కుటిలుని భార్య !

కుటిలునికి నిజంగా కోపం వచ్చేసింది.

"ఛీ! నోరు మూసుకొని అవతలకు పోతారా లేదా! మీరంతా పశువులు జంతువులు! నా మంత్రాంగం మీకు తెలీదు. తెలుసుకోలేరు. అందుకే మామూలు మంత్రిగా వున్నవాణ్ని రేపటి నించీ ఒక ముఖ్యమంత్రి పదవిని సృష్టించి, ఆ పదవిలో ప్రవేశించ బోతున్నాను," అన్నాడు.

అప్పటికి అందరికీ కుటిలునికి నిజంగా, పిచ్చి ఎత్తిందనీ, ఇప్పుడు అది బాగాముదురు పాకాన పడి పోయిందనీ, ఇహ దేవుడికూడా వీణ్ని రక్షించటం చేత కాదనీ తెలిసిపోయింది.

"చూశారా బాబూ! నా మొగుడికి ఈ మంత్రి పదవి అచ్చిరాలేదు. నా మొగుడు మంత్రి అయితే నేను మంత్రిగారి భార్యనయి పోయానని పొంగి పోయాను! కానీ ఈయనకు ఇలా పదవి పిచ్చిపడుతుందని అనుకోలేదు బాబూ! దయ్యమంత అపదరేపు ముంచుకొస్తుంటే, ముఖ్యమంత్రిని అయికూర్చుంటానని అంటాడేంబాబూ! మీరంతా కలిసి ఈయన్ను పిచ్చివాళ్ళ అస్పత్రిలో పడేయండి" అంటూ ఏడ్చింది ఇల్లాలు.

# 7

కుటిలుని మీద నేరవిచారణ ప్రారంభం అయింది.

న్యాయాధిపతి, న్యాయమంత్రీకూడా అయిన మహావృషభుడు న్యాయ స్థానంలోకి ముందుగా ప్రవేశించాడు.

తర్వాత కొద్ది సేపటిలో మహారాజూ, మహారాణీ, పరిచారికలూ వచ్చి తమ తమ స్థానాల్లో కూర్చున్నారు.

"ఈనాడు మా మంత్రి వర్గంలోనే ఒకరుగా వుంటున్న ఆర్థిక శాఖ మంత్రి, గౌరవనీయులు అయిన శ్రీ కుటిలుని మీద నేర విచారణ జరుగ నున్నది. ఒకరికి ఆదర్శంగా ప్రవర్తించ వలసిన తోటి మంత్రి వర్యులే నేరస్థులుగా నేడు న్యాయ స్థానంలో అడుగు పెడుతున్నారు. ఇందుకు నేను వ్యక్తిగతంగా నా విచారాన్ని వెలిబుచ్చుతున్నాను. మన గౌరవనీయులయిన ఆర్థిక మంత్రిగారు నేరానికి పాల్పడటం మంత్రి మండలికే తీరని కళంకాన్ని తెచ్చి పెట్టింది" అన్నాడు మహా వృషభుడు.

ప్రేక్షకులుగా వచ్చిన వారిలో కొందరు "అవమానం, అవమానం" అంటూ అరిచారు.

"నిశ్శబ్దం, నిశ్శబ్దం" అంటూ గంట కొట్టారు న్యాయాధిపతి. కుటిలుడు మాత్రం నిమ్మకు నీరెత్తినట్లుగా నిండుగా కూర్చోవటం రాజుగారికి కూడా ఆశ్చర్యం కలిగించింది.

"ఎంత మూర్ఖుడు" అనుకున్నారు కుటిలుని గూర్చి మహారాజు.

"ఎంత తెలివిగల వాణ్ని నేను. నాకు ముఖ్యమంత్రి పదవి కొద్ది క్షణాలలో రాబోతుంది. అదృష్టదేవత నన్ను వరించ బోతోంది" అనుకున్నాడు చిరు నవ్వు ముఖంతో !

కుటిలుని చేత న్యాయాధీశ్వరుడు ప్రమాణం చేయించాడు: "నేను నిజాన్నే చెబుతాను. భగవంతుని సాక్షిగా నేను అబద్ధం చెప్పను" అన్నాడు కుటిలుడు !

ప్రజలు కొందరు ఈలలు వేసి గోల చేశారు !

"నిశ్శబ్దం, నిశ్శబ్దం" మళ్ళీ గంట మోగింది.

"కుటిలుడు గారూ ! మీరు మహారాణిగారి బృందం వన విహారం చేస్తుంటే,వారిని రహస్యంగా మీరు అనుసరిస్తున్నారు కాదూ, ఏం?" అన్నాడు న్యాయాధిపతి.

"లేదు. వారు వన విహారానికి బయలుదేరిన సంగతి నాకు తెలీదు" అన్నాడు కుటిలుడు.



"మరి వారు స్నానాలు చేయదలచుకున్న చోట మీరూ వుండటం ఎలా జరిగింది?"

"న్యాయాధ్యక్షా! నా జాతిని మీరు మరిచిపోయి ఈ ప్రశ్న వేశారు."

"మీరు పుట్టిన జాతికీ, రాణివాస స్త్రీలు స్నానాలు చేయదలచిన చోట మీరు వుండటానికీ సంబంధం లేదు. చెప్పే సమాధానాన్ని ముద్దాయి సూటిగా చెప్పటం నేర్చుకోవాలి" మందలించుతూ అన్నాడు న్యాయాధిపతి!

"తమకు తోచక పోతే చెబుతాను, నేను పుట్టింది నక్క జాతిలో! బొమికలు వెతకటం మా జాతి సహజమైన పని. ఆరోజు ఆ చెరువు సమీపంలో ఏదో చనిపోయిన జంతువు యొక్క కళేబరం దొరికితే నేనొక్కడినీ, దాన్ని తినే ఆసక్తితో అక్కడ వుండవలసి వచ్చింది" నేర్పుగా చెప్పాడు కుటిలుడు.

"వుంటే వుండ వచ్చుగాక, మీరు రాణివాసపు స్త్రీలు అక్కడ వున్నారని గుర్తించాక, అక్కడ నుంచి గౌరవంగా ఎటయినా వెళ్లిపోతే బాగుండేది. అలా ఎందుకు చేయలేదు?"

"నేనలా తలవంచుకొని బుద్ధిమంతునిలా వెళ్ళితే చాలా ప్రమాదం జరిగేది. కనుకనే తలవంచుకోకుండా వారిని ఏ క్షణంలో ఏం చేస్తూ వున్నారో చూస్తూ నిలబడ్డాను."

"వారినలా చూడటం నేరమని అంగీకరిస్తారా!"

"వారినలా చూడటం వేరే చోటయితే నేరం కావచ్చు. కానీ ఆ ప్రదేశంలో నేరం కాదు. అవసరం కూడా."

"ఏమిటి మీ అర్థంలేని సమాధానాలు! మీరు నేరస్థులుగా రుజువయితే మీకు విధించబోయే శిక్ష తెలిసే ఇలా మాట్లాడుతున్నారా?"

"తెలిసే మాట్లాడుతున్నాను."

"అయితే వారిని అలా చూడటం ఎందుచేత నేరం కాదో సెలవీయండి."

"ధర్మాధ్యక్షా! నేనలా వారి వంక చూడటం, వెంటనే ఆచట నుండి వారిని వారి ఇంటికి తరిమి వేయటం, నేను చేసిన శుభకార్యాలుగా భావిస్తున్నాను. ఈ రీతిగా నయినా, రాజకుటుంబాన్నీ, ముఖ్యంగా, పుట్టబోయే యువరాజునూ రక్షించుకో గలిగాను! ఈ విషయాన్ని ఏలిన వారు తెలుసుకొంటే, నేను ఏ శిక్షనయినా సంతోషంగా పొందటానికి సిద్ధంగా వున్నాను" అన్నాడు గర్వంగా కుటిలుడు!

అందరూ ఆశ్చర్యపోయారు! మహారాజూ, మహారాణీ కూడా!

"రాజ కుటుంబాన్ని రక్షించటం ఏమిటి? పూర్తిగా వివరించు" ధర్మాధ్యక్షుడు అడిగాడు.

"అయ్యా నాతో తమరందరూ రండి. నేను రాణీగారి బృందంతో ఎందుకలా అన్నదే తమకే తెలుస్తుంది," అన్నాడు కుటిలుడు. అందరూ ఆశ్చర్యంగా అతన్ని అనుసరించారు!

"వ్యాయాధీశులూ, మృగేంద్రులూ ఇంకా మంత్రులూ, ప్రజలూ కుటిలుని అనుసరించారు!

ఆ పద్మ సరోవరం చుట్టూ అంతా చేరారు!

"అయ్యా! ఈ కొలనులో ఎన్నెన్నో బ్రహ్మాండమైన ఆశ్చర్యాలు జరుగుతున్నాయి. అమాయకంగా ప్రతిరోజూ ఏదో జంతువు ఈ కొలనులో నీరు త్రాగటం కోసం రెండు అడుగులు నీటిలో వేసి నుంచుంటాయి! అంతే! చాలా నేర్పుగా తామరపూల అడుగు నుంచి, కనిపించకుండా బ్రహ్మాండమైన మొసళ్లు వచ్చి ఆ జంతువును పట్టి కొలనులోకి గుంజుకు పోతాయి. ఆ జంతు

వును నీటిలోచంపి తినేస్తాయి. ఈ రాణిగారి బృందంలోవి అందరూ కొలనులో అడుగువేసే వారు! ఈ దారుణమైన మరణం పొందేవారు! అందువల్లే నీతి నియమాలను అవతలకు నెట్టి, ఈ మహిళల నందరినీ, నీటిలోకి దిగనీయకుండా ఇంటికి పంపించటంలో నేనెంతో గొప్ప మేలు చేసినట్లే భావిస్తున్నాను." అన్నాడు కుటిలుడు.

"కొలనులో మొసళ్లు వున్న విషయంలో నీవు చెప్పే సమర్థన ఏమిటి?"

ఒక కుక్కపిల్ల వొడ్డున చేరి అరిచినట్లుగా అరిచాడు కుటిలుడు! ఈ అరుపుకూ సరస్సులోని మొసళ్ళు నీటిపైకి వచ్చాయి! కుక్కపిల్ల అరుపునకూ, మొసళ్ళకూ అలాటి విచిత్ర సంబంధంవుంది! కుక్కపిల్ల అరిస్తేచాలు మొసళ్ళు తలను నీటిపైకి ఎత్తి వచ్చేస్తాయి!

"ఇప్పటికైనా నేను చేసింది నేరమని మీకు తోస్తే మీరు ఇచ్చే శిక్ష పొందుతాను," అన్నాడు కుటిలుడు.

"ఒక గొప్ప గండం గడిచింది. రాణిగారికీ, ఆమె బృందానికీ!" అనుకున్నారు ప్రజలు!

అందరూ ఏకగ్రీవంగా కుటిలునికి జయ జయ నినాదాలు చేశారు!

"కుటిలుడు రక్షించకపోతే వన విహారపు ఉత్సాహంలో అంతా కొలనులోకి దిగేవారు. మొసళ్ల చేత అందరూ చచ్చి పోయేవారు! ప్రాణరక్షణ సమయంలో నీతి నియమాలు పాటించే అవసరం లేదు. కనుక కుటిలుడు నిర్దోషి అని రుజువయింది," అన్నారు ధర్మాధ్యక్షులు!

రాజవంశానికి ఈ రీతిగా కుటిలుడు మహోపకారం చేశాడు కాబట్టి, అతనితో రాజవంశం ఎప్పుడూ కృతజ్ఞతతో ప్రవర్తించుతుంది. ఈ సందర్భంలో కుటిలుడు మానుంచి తనకు ఏమి ప్రత్యుపకారం కావాలో చెబితే దానిని నెరవేర్చటానికి సిద్ధంగా వున్నాం," అన్నారు సంతోషంతో మహారాణీగారు!

"అవును. కుటిలునికి ఏదైనా ప్రత్యుపకారం చేయాలి! ఏం కావాలో అతడు కోరుకోవచ్చు," అన్నారు మృగేంద్రులు.

"మహారాజా! నన్ను అపార్థం చేసుకోకుండా వుంటే నాకు అదే పదివేలు! నేనంటే గిట్టనివారు నన్నొక స్వార్థపరునిగా చిత్రిస్తారు! ప్రచారం చేస్తారు! అయినా నామీద ఎన్ని చెడు ప్రచారాలు సాగినా నేనేం చింతించను. నాకు కావలసింది రాజుగారి క్షేమం, ప్రజల క్షేమమూ! వారి క్షేమం కోసం అవసరం అయితే నా ప్రాణాలు అర్పించటానిక్కూడా నేనెప్పుడూ సిద్ధంగా వుంటాను! అయినా రాజుగారూ, రాణీగారూ నా కోరిక తెలుప మంటున్నారు కనుక ప్రజల శ్రేయస్సు కోసం ఒక కోరిక తెలుపుకుంటాను," అన్నాడు కుటిలుడు.

"చెప్పండి." అన్నట్లుగా చూశాడు మహారాజు.

"ప్రస్తుతం వేర్వేరు శాఖలకు వేరు వేరుగా మంత్రులు పనిచేస్తున్నారు. ముఖ్యమంత్రి పదవిని ఇంతవరకూ మహారాజులవారు ఏర్పాటు చేయలేదు. కనుక ఒక ముఖ్యమంత్రి పదవిని ఏర్పాటు చేసి, నన్ను ముఖ్యమంత్రిగా చేస్తే, అది మంత్రి మండలికే ఒక హుందాతనం తెస్తుంది! ఒకవేళ ముఖ్యమంత్రి పదవికి నేను తగిన వాణ్ని కాకపోతే మరొకరిని మహారాజులు ఆ పదవిలోకి ఎన్నుకోవచ్చు! నేను మామూలు మంత్రిగానే ప్రజల సేవ చేస్తాను." అన్నాడు కుటిలుడు!

అడిన మాట తప్పటం మృగేంద్రుని వంశంలోనే లేదు కనక, కుటిలుని కోరిక నెరవేర్చారు! అంతరంగిక మంత్రే ఇంతవరకు ముఖ్యమంత్రి బాధ్యతలు చూసేవాడు. ఇప్పుడు వేరే ముఖ్యమంత్రి పదవి ఒకటి ఏర్పాటు చేశారు.

కుటిలుడు ముఖ్యమంత్రి అయ్యాడు.

కుటిలుని వర్గం వాళ్లు మీసాలు మెలేశారు!

వ్యతిరేక వర్గం వారు మాత్రం మనసులో చాలా నొచ్చుకున్నారు.

"అంత చిన్న ఉపకారం చేసినందుకు గాను కుటిలునికి ముఖ్యమంత్రి పదవిని ఇవ్వటం క్షేమం కాదు," అనుకున్నా రాజుగారితో చెప్పగల సాహసం ఎవరికుంది !

మహారాజులకు ఏ క్షణంలో ఆగ్రహం వస్తుందో, ఏ క్షణంలో అనుగ్రహం కలుగుతుందో చెప్పలేం !

# 8

కుటిలుడు రాజ కుటుంబానికి ఈ మధ్య చాలా ఆప్తబంధువు అయిపోయాడు.

ప్రతిరోజూ ఉదయమే రాజుగారి ఇంటికి వస్తాడు. "అమ్మా నమస్కారం! నీవు నామీద కరుణించ బట్టి నావంటి సామాన్యుడు ముఖ్యమంత్రి కాగలిగాడు! నేను, నా పదవీ మహారాజ దంపతుల సేవ కొరకే !

"మీ ఆరోగ్యం ఎలా వుంది తల్లీ!"

"రాత్రి చక్కగా నిద్ర పట్టిందా అమ్మా !"

"ఒంట్లో బడలిక లేకుండా వుందా ?"

"ఇప్పుడు మీరు గర్భవతులు ! మీకు కొత్త కొత్త రుచులతో అవీ ఇవీ తినాలని అనిపించుతుంది. నాతో చెప్పండి. మీకేం ఇష్టమయితే అది తెప్పించుతాను."

ఇలా అడుగులకు మడుగులొత్తుతూ రాణిగారి దృష్టిలో కుటిలుడు చాలా మంచివాడుగా ప్రవర్తించసాగాడు.

అంచేత కుటిలుడు రాగానే అతనికి ఒణుక్కుంటూ కుర్చీలు వేసేవాళ్ళు, అతనికి ఫలహారాలు తెచ్చేవాళ్ళు, 'మన మీద ఏం చాడీలు చెబుతాడో రాణీ గారికి' అంటూ భయపడే వాళ్ళు రాజమందిరంలో ఎక్కువయ్యారు.

కుటిలునికి అవతల వ్యక్తుల మనస్సులోని అభిప్రాయాన్ని కనిపెట్టి అందుకు తగినట్లుగా తాళం వేయటం వెన్నతో నేర్పిన విద్య.

రాణీగారికి క్రమంగా నెలలు నిండుతున్నాయి.

ప్రతిరోజూ ఆమె కోర్కెలు తీర్చుతూ ఆమె ఏది తలిస్తే ఆ పని నెరవేరుస్తూ లేకలేక కలిగిన ఈ గర్భవతికి ఎంతో సంతోషం కలిగిస్తున్నాడు మృగేంద్రుడు.

ఒకరోజు ఆనిండు చూలాలికి ఒక చిత్రమైన కోరిక కలిగింది. ఆమెకు వన విహారం చేయాలనే కోరిక కలిగింది. ఇలా చెప్పిందో అలా అల్లుకు పోయాడు కుటిలుడు.

"అమ్మాగారూ! మీరు అవునంటే చక్కని యాత్ర ఏర్పాటు చేస్తాను, అంటూ ఒక పథకం వేశాడు.

"ఎప్పుడూ ఒళ్ళు కదలకుండా ఇంట్లోనే కూర్చుంటే గర్భవతికి ఆరోగ్యంగా వుండదు. అప్పుడప్పుడు అటూ ఇటూ నాలుగు అడుగులు వేయాలి," అన్నాడు కుటిలుడు.

రాణీగారు పంతసించింది.

కుటిలుడు ఒక పథకం తయారుచేశాడు.

సపరివారంగా రాణీగారు బయలుదేరుతారు. మొదట 'కుసుమ వనంలో' విడిది చేస్తారు.

దాని తర్వాత ముని ఆశ్రమాలున్నాయి. అచట ఒకరోజు వుండి మహర్షుల ఆశీస్సులు పొందుతారు, ఇది రెండవ రోజు కార్యక్రమం.

మూడవ రోజు 'ఫలవనం'లో విడిది చేస్తారు.

నాల్గవ రోజున 'పర్వత వనం'లో కొండమీదకు వెళ్ళి విశ్రాంతి తీసుకుంటారు.

అయిదవ రోజు తిరిగి వస్తారు.

—ఇదీ కుటిలుడు వేసిన యాత్రా ప్రణాళిక!

ఈ పథకాన్ని చూడగానే రాజుగారికి ఇష్టంలేక పోయింది! అంతరంగిక వ్యవహారాల మంత్రి అయిన భల్లూకేశ్వరునికి ఈ పథకం చూపించారు మహారాజు.

భల్లూకపతి, మృగేంద్రుల వారూ రహస్య సమాలోచన మందిరంలో కూర్చొని కాస్సేపు ఈ యాత్ర గూర్చి చర్చించుకున్నారు!



"మహారాజా ! రాణిగారు ఇపుడు నిండు చూలాలు. ఆమెకు ఎంతో శ్రమ కలిగించే విధంగా ఈ యాత్రను రూపొందించాడు కుటిలుడు ! కుటిలుడు సామాన్యుడు కాడు ! ఇందులో ఏదో సందేహించవలసిన విషయం వుంది.—

"చెప్పమంటారా మహారాజా" అని అన్నాడు అంతరంగిక మంత్రి.

"అందుకేగా నీతో చర్చించటం" అన్నారు మృగేంద్రులు.

"ప్రభూ ! కుటిలుని ఆలోచనలు ఈ మధ్య చాలా విపరీత ధోరణిలో నడుస్తున్నాయి. పరిపాలనా సంస్కరణల పేరుతో ముఖ్యమంత్రి అయినప్పటి నుంచీ చాలా నిజాయితీగా పనిచేసే ఉద్యోగు లందరినీ ఏదో సాకు మీద ఇంటికి పంపించాడు ! తనకు నచ్చిన వారినీ, తనకు ఇష్టం అయిన వారినీ, ఆశ్రితు లనూ చాలా మందిని ప్రభుత్వ యంత్రాంగంలో తనకు గల అధికారం ఉపయో గించి, ప్రవేశ పరచాడు ! అతని మనసులో ఏవో ఆలోచనలు చాలా విపరీతంగా వున్నట్లు మాత్రం రహస్యంగా మన గూఢచారి వర్గం ద్వారా పసి కడుతూనే వున్నాను.

"ఇది మామూలుగా ఒక గర్భవతి చేయవలసిన యాత్ర కాదు. అందు లోనూ యువరాజా వారిని కనటానికి సిద్ధంగా వున్న మహారాణీ ఈ యాత్ర చేయటం నాకు ఇష్టం లేదు. దీని వెనక ఏదైనా రాజకీయపు కుట్రలు, ఎత్తు గడలూ వున్నాయేమో తెలుసుకోవాలి.

"మహారాజా ! కుటిలుడు ముఖ్యమంత్రి అయిన నాటి నుంచీ వాని ఇంట్లో మన గూఢచారిని పనిమనిషిగా ఏర్పాటు చేశాను. కుటిలుడు ఏమేమి చేస్తున్నాడో అతనికి బంటుగా వున్న గూఢచారి కనిపెడుతున్నాడు. కుటిలుని రహస్యపు ఆలోచనలు ఏమైనా వుంటే మన రాజ నర్తకి ద్వారా కనిపెట్టే ఏర్పాటు చేశాను.

"ప్రభూ ! మీరీ విహార యాత్రకు అంగీకరించకండి. మహారాణి గారితో చాలా నేర్పుగా ఈ యాత్ర నుంచి విరమించేటట్లు చూడండి" అన్నాడు అంత రంగిక మంత్రి.

మహారాణిగారూ, ముఖ్యమంత్రిగారూ యాత్రను గూర్చి చర్చించు కుంటూ వుండగా మృగేంద్రులు అక్కడకు వెళ్ళారు.

మహారాణిగారికి వినోద యాత్రకు వెళ్ళే దోవను ఒక కాగితం మీద గీసి చూపించాడు. వారు విడిది చేయ బోయే 'కుసుమ వనం', 'ముని ఆశ్రమ వాటి కలు', 'ఫలవనం', కొండ మీద గల 'పర్వత వనం' ఎలా వుంటాయో వర్ణిస్తూ ఆ యా ప్రదేశాల్లో గల ప్రకృతి సౌందర్యాన్ని ప్రదర్శించే వర్ణ చిత్రాలను ఆమెకూ, రాజుగారికీ చూపించాడు కుటిలుడు.

"అపుడే అ సుందర దృశ్యాలకు ప్రతి చిత్రాలు కూడా తయారు చేయిం చారే ముఖ్యమంత్రులు" అన్నారు రాజుగారు !

"మన ముఖ్యమంత్రిగారికి లలిత కళలంటే ఎంతో ఇష్టం. చిత్రకళ అంటే మరీను" అంది ఆమె.

"ప్రభూ ! ఈ అందమైన ప్రదేశాల్లో నేను చాలాసార్లు తిరిగాను. అందు చేత మన ఆస్థాన చిత్రకారుల చేత ఆ ప్రదేశాలకు చెందిన ప్రకృతి దృశ్యాలు గీయించి రాణీగారికి బహూకరించాను. అందువల్లనే రాణీగారికి అక్కడకు పోయి నాలుగు రోజులు సరదాగా గడపాలనే కుతూహలం కలిగింది. మీరు అవునంటే రేపే ఈ యాత్రా బృందం బయలుదేరుతుంది" అన్నాడు కుటిలుడు.

మృగేంద్రునికి ఇది గడ్డు సమస్యగా తయారయింది.

కాదంటే మహారాణి నొచ్చుకుంటుంది.

అవునంటే దీనివెనక రాజకీయంగా కూడా ఏం పన్నాగాలున్నాయో, ఈ

యాత్ర నిండుచూలాలికి కష్టం కలిగిస్తుందేమో! ఇలా మథన పడ్డాడు మహారాజు.

"అంతసేపు ఆలోచిస్తున్నారేం మహారాజా! ఈ యాత్ర పనికి రాదని మీ అంతరంగిక మంత్రిగారుసలహా ఇచ్చారా! అలాగయితే మీ ఇష్టంమానేయండి. నే నేదో ముఖ్యమంత్రిగా మాత్రమే మీకు సేవ చేయగలను. కానీ అంతరంగిక వ్యవహారాల మంత్రిగా ఆయనకే నాకంటే ఎక్కువ ప్రాముఖ్యత వుందేమో... మీ ఇష్టం" అన్నాడు కుటిలుడు.

"అలా సలహా ఇవ్వటానికి అంతరంగిక మంత్రి ఎవరు ? ఇది నా స్వవిషయం. రాణీగారి స్వవిషయంలో అంతరంగిక మంత్రి సలహా పాటించటం అనవసరం. ముఖ్యమంత్రిగారు వేసిన ఈ యాత్రా పథకం అమలు జరిగి తీరాలి. మహారాణిగా నేను ఆజ్ఞాపించుతున్నాను" అంది రాణీగారు.

"అంతే కాదు. రేపు ఉదయమే మేమంతా బయలుదేరాలి" అని కూడా అంది.

అప్పుడు అంతరంగిక మంత్రి వచ్చి ఇలా అన్నాడు.

"మహారాణీ! తమరి ఇష్ట ప్రకారమే జరుగుతుంది. మీ సంతోషం కొరకే మేమంతా వున్నాం. ఈ రోజు నుంచి రేపు ఉదయం వరకు కొన్ని వేల మంది కూలీలను పెట్టి మీ విహార యాత్రకు దారి బాగు చేయిస్తాం. రథాలు పోతుంటే మీకు శరీరం అదరకుండా, కుదుపులు కలగకుండా దోవను నున్నగా సాఫీగా వేయిస్తాం.

"ఈ యాత్రకు అయిదు రథాలు బయలుదేరతాయి. ముందు రథంలో రక్షణ మంత్రీ, ముఖ్యమంత్రీ వుంటారు. రెండవ రథంలో మహారాణీగారూ ఇద్దరు పరిచారికలూ వుంటారు. మూడవ రథంలో రాణీగారి పరిచారికలూ, పాటలు పాడేవారు, ఆటలు ఆడేవారు, నృత్యం చేసేవారూ వుంటారు. ఇది చాలా పెద్ద రథం. విశాలంగా ఎందరినో తీసుకుపోగలదు. నాల్గవ రథంలో రాజ

వైద్యుల బృందం వుంటారు. అయిదవ రథంలో ఒక పటాలం సైనికులు వుంటారు.

"ప్రతిరోజూ ఈ యాత్రా బృందం నుంచి క్షేమ వార్తలు మనకు అందుతూ వుంటాయి."

ఈ సూచన మహారాజుకూ, రాణికీ, కుటిలునికీ నచ్చింది.

## 9

అనుకున్న ప్రకారం ఎలాటి ఇబ్బందులూ లేకుండా యాత్ర సాగి పోయింది.

మొదటి రోజు కుసుమ వనంలో, రెండవ రోజు ముని ఆశ్రమాల వద్ద, మూడవ రోజు 'ఫలవనం'లోనూ గడిపి, నాల్గవరోజు పర్వతవన యాత్రలో ప్రవేశించారు.

రథాలన్నీ, పరాసరి కొండ మీద దాకా వెళ్ళేందుకు కొండ చుట్టూ మెలికలు మెలికలుగా తిరిగే దారి వేశారు. కొండమీదకు ఎక్కటానికి ఒక దోవ, దిగటానికి మరో దోవ వున్నాయి.

'పర్వతవనం' చూస్తుంటే స్వర్గంలోని 'నందనవనం' గుర్తొస్తుంది:

తెల్లటి మబ్బులు దూది పింజలు ఎగిరినట్లుగా పర్వత వనాన్ని తాకుతూ వెళ్తున్నాయి. వేసవి కాలం కూడా ఆ కొండమీద ఎంతో చల్లగా హాయిగా వుంటుంది.

పర్వత వనానికి పడమటి అంచున ఒక బ్రహ్మాండమైన లోయ వుంది. ఆ లోయ చూడటానికి ఎంత సుందరంగా వుంటుందో అంత భయంకరమైనది. అందుచేత దానిని 'మృత్యులోయ' అని కూడా అంటారు! కొండమీద నుంచి

చూస్తే లోయలో అట్టడుగున వున్న వాళ్ళు కూడా సన్నగా చిన్నగా కనబడతారు.

ముఖ్యమంత్రి, రక్షణ మంత్రి, రాజవైద్యులు, రక్షణ బృందం,... అందరూ పర్వత వనంలో తూర్పు వైపు గుడారాల్లో విడిది చేశారు. దక్షిణం వైపుగా రాణీగారూ, సేవకులూ, సేవికలూ విడిది చేశారు.

సాయంత్రం పూట ఒక్క చెలికత్తెను వెంట తీసుకుని బయలుదేరింది మహారాణి! తోడు వస్తామన్న చెలికత్తెలను రావద్దని ఆజ్ఞ ఇచ్చింది. ఆమె ఒక్కతే ఒక పరిచారికతో విహారానికి బయలుదేరింది!

సరిగ్గా అదే సమయానికి ముఖ్యమంత్రిగారూ, రక్షణ మంత్రిగారూ ఇంకా



రాజవైద్యులూ, అంకరూ గుడారాల్లో కులాసాగా కాలక్షేపం చేస్తూ, మద్యం సేవించటంలో శరీరం మరచి పోతున్నారు! వాళ్ళంతా తూలి పోతున్నారు. తేలి పోతున్నారు!

సరిగ్గా అదే సమయానికి రాణీగారు కూడా మనోహరంగా వున్న ప్రకృతి సౌందర్యాన్ని చూస్తూ పడమటి దిశగా బయలుదేరింది.

"నా వెంట ఎవ్వరూ రానవసరం లేదు. నేనొక్కతెనీ అలా వెళ్ళివస్తాను," అంది రాణీగారు. ఎందుకయినా మంచిదని ఒక పరిచారిక ఆమెను అనుసరించింది; కాస్త వెనకగా ఆమె వెంట బయలుదేరింది.

సూర్యుడు అస్తమించే వేళ! పడమటి వైపు ఆకాశం ఎర్రగా నిప్పులు చెరుగుతూ, ఏదో ప్రమాదాన్ని సూచిస్తూ వుంది!

ఆ కొండను ఆనుకొని ఒక బ్రహ్మాండమైన లోయ పడమటి దిశగా వుంది. లోయలో సాయంత్రపు ఎండ పడుతూ వుంది. ఆ ఎండలో ఇండ్లకు మరలి పోతున్న గొర్రెల గుంపులూ, మేకల గుంపులూ కనిపించాయి రాణీగారికి! గొర్రె మాంసం తలుచుకోగానే ఆమెకు నోరూరింది! అసలే నిండు చూలాలు!

ఆ గొర్రెల మందవైపు చూపు నిగిడ్చి ముందు ముందుకు అడుగులు వేస్తోంది మహారాణి.

"అమ్మగారూ! ముందుకు వెళ్ళకండి! ప్రమాదం!" అంటూ కాస్త వెనకాల వస్తున్న పరిచారిక అరిచింది!

ఆ దాసీది వచ్చే లోపల మహారాణిగారు పరధ్యానంతో ఒక్క అడుగు ముందుకు వేసింది! అంతే! అమాంతంగా ఆ నిండు చూలాలు లోయలో తల్లక్రిందులుగా పడిపోయింది. రెప్పపాటులో ఘోరమైన ప్రమాదం జరిగిపోయింది! సరిగ్గా అదే చోట చాలామంది లోగడ కూడా ఇలాగే లోయలో పడిపోయి ప్రాణాలు పోగొట్టుకున్నారు. అందుకే దానిని 'మృత్యులోయ' అంటారు!

దాని అరుపు విని ఖడారాల్లో వున్న పరిజనం అంతా రివ్వున పరిగెత్తు కొచ్చారు!

కుటిలుడు, వ్యాఘ్రపతి, రాజవైద్యుడు అంతా పరుగెత్తి వచ్చారు. దాసీలంతా గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు! వారి ఏడుపునకు కొండంతా మారుమోగుతోంది. వారు గుండెలు కరిగేలా ఏడుస్తున్నారు!

"మహారాణీ! నువ్వు ఒక్కతెవీ ఎందుకు రావలసి వచ్చిందమ్మా! మమ్మల్ని వద్దని నీవొక్కతెవీ ఈ లోయలో పడిపోవటానికే వచ్చావా తల్లీ!"

"మమ్మల్నందరినీ కన్నబిడ్డల్లాగా పెంచావు. ఆదరించి పోషించావు. నీకీ రీతిగా ఘోరమైన మృత్యువు రాసి పెట్టి వుందా?"

"నీ కడుపున ఒక బిడ్డ పుడతాడనీ, లేకలేక కలిగిన ఈ బిడ్డతో, మనందరికీ ఎంతో సంతోషం కలుగుతుందనీ కలలు కన్నాము. అవన్నీ చెరిగి పోయినవా తల్లీ!"

"రాజా వారికి ఈ దుర్వార్త ఎలా చెప్పం? చెప్పి ఎలా బ్రతకగలం?"

"ఆయన క్రోధావేశానికి బలి అయిపోయి చావటానికి బదులుగా మనందరం ఇక్కడే చచ్చిపోతే బాగుంటుంది."

ఈ రీతిగా దాసీ జనం అందరూ వలవలా ఏడ్చారు.

కుటిలుడు కూడా ఈ దారుణం చూసి నిలవదొక్కుకో లేక పోయాడు.

కుటిలుడికీ, రక్షణ మంత్రి అయిన వ్యాఘ్రపతికీ, రాజవైద్యునికీ నిషా దిగి పోయింది.

అందరి శరీరాలూ జరిగిన ప్రమాదం, ఘోర మృత్యువును చూసి చెమటలు పట్టిపోయాయి. దుఃఖంతో గొంతులు బిగిసి పోయాయి! ఒకరి మొఖాలు ఒకరు తెల్లబోయి చూసుకున్నారు.

చీకటి పడింది.

"నిండు చూలాలు ఇంత ఎత్తయిన పర్వతం మీద నుంచి పడిపోతే ప్రాణాలతో బ్రతికి బయట పడటం అసంభవం. పోయి మహారాజుగారి కాళ్ళ మీద పడదాం. ఆయన ఏ శిక్ష విధించినా సంతోషంగా అనుభవించుదాం" అన్నాడు రక్షణ మంత్రి!

"మహారాణి యీరీతిగా మరణించాక మనం బ్రతికివుండటం సిగ్గుచేటు! ఇంత మంది రక్షణగా వెంటవుండికూడా, ఆమెను ఒంటరిగా విడిచి, ఆమె మరణానికి మనం అందరం కారణం అయ్యాం. మనక్కూడా మరణశిక్ష తప్పదు" అన్నాడు రాజవైద్యుడు.

కుటిలుడు మూర్ఛపోయినట్లు నటించుతూ నేలమీద పడిపోయాడు. అప్పుడు రాజవైద్యుడు, అంతా కలసి కుటిలునికి సేవచేశారు.

"ముఖ్యమంత్రిగారికి ఈ దారుణం చూసి మూర్ఛవచ్చింది. వీరిని గుడారం లోకి చేర్చి విశ్రాంతి నివ్వండి" అంటూ ఏవో మందులు వాడాడు వైద్యుడు.

కొంచెంసేపటికి తేరుకొని "మహారాణీ! మహారాణీ! నేనుకూడా ఆ లోయలో పడి ప్రాణాలు పోగొట్టుకుంటాను. ఇంకా ఎందుకు బ్రతకాలి తల్లీ! నీతోపాటు నేనూ చచ్చిపోతాను" అంటూ లోయవైపు పరుగెత్తుతూ వుంటే అందరూ అతన్ని బలవంతాన పట్టుకున్నారు!

"మహారాణి యెంతో మంచిది. మీరంతా చెడ్డవాళ్లు! మహారాణి చచ్చిపోయింది. మనం బ్రతికివున్నాం. మంచివాళ్ళంతా చచ్చారు. బ్రతికివున్న వాళ్ళంతా చెడ్డవాళ్ళు.

"మీరంతా పోండి. రాజుగారి దగ్గరకు వెళ్ళండి. ఇచ్చే బహుమానం తీసుకోండి.

"నాకే బహుమతీ వద్దు! రాణీగా రిచ్చిన బహుమతులు చాలు!" అంటూ ఏడుస్తూ, సముదాయించిన వారిని కొడుతూ పిచ్చిచేష్టలు ప్రారంభించాడు.

"ముఖ్యమంత్రిగారికి ఈ దుఃఖం భరించలేక మతి తప్పింది. పిచ్చివాడై పోయాడు. వీరిని జాగ్రత్తగా కనిపెట్టి వుంచండి. పారిపోయి లోయలో పడి చావకుండా తాళ్ళతో కట్టిపడేయండి" అని ఆజ్ఞాపించాడు రక్షణమంత్రి.

ఆ రాత్రి యెవ్వరూ కునుకు తీయకుండా గడిపారు. అందరూ భయంతో, బాధతో కుమిలిపోతూ లోలోపల యెంతో దిగులుపడ్డారు.

ఎంత సంతోషంగా బయలుదేరారో, అంత దుఃఖంతో యాత్ర ముగించారు.

నిండు చూలాలుగా, సరదాగా మహారాణిగారు కోరుకున్న ఈ యాత్ర ఆమె జీవితంలో చివరి యాత్రగా, పరలోక యాత్రగా మారుతుందని ఎవరు కలగన్నారు!

మర్నాడు సూర్యోదయం అయ్యాక యాత్రాబృందం తిరుగుముఖంపట్టి కొండ దిగి అడవిదోవలో రాజమందిరానికి సాగిపోయారు.

కుటిలుడికి మాత్రం పిచ్చి యెక్కువయింది. రాత్రి చాలామందిని పిచ్చిగా కొరికాడు. అతన్ని రథంలో కుదురుగా కూర్చోపెట్టటం కష్టం అయింది.

# 10

రాజుగారికి ఈ వార్త చెవిన పడేసరికి నిలువునా కూలిపోయాడు.

అంతరంగిక మంత్రిగారయిన భల్లూకపతికి కూడా తల తిరిగిపోయింది. అయినా చాలా గంభీరంగా అందరూ చెబుతున్న సంగతులను జాగ్రత్తగా వింటున్నాడు.

"ఇది ప్రమాదవశాత్తూ జరిగిందా? లోగడ అనుమానించినట్లుగా రాజకీయపు కుట్రా?" అనుకుంటూ ఆలోచించ సాగాడు.

"రాణీగారు చచ్చిపోయారు. నేను చచ్చిపోయాను" అంటూ పిచ్చిగా వాగుతున్న కుటిలుణ్ణి చూసి జాలిచెందాడు అంతరంగిక మంత్రి.

"ముఖ్యమంత్రికి తగిన చికిత్సచేస్తూ అయన్ను భద్రంగా యింట్లోనే వుండనివ్వండి. మానసికంగా చాలా దెబ్బతిన్నట్లు కనిపించుతున్నాడు. అతనికి విశ్రాంతి నివ్వండి" అంటూ కుటిలుణ్ణి జాగ్రత్తగా యింటికి చేర వేయించాడు.

మహారాజుగారు కూడా కొద్దిసేపటికి తెప్పరిల్లుకో గలిగారు.

"మీరంతా వెళ్ళిపోండి" అని ఆజ్ఞాపించారు. అంతరంగిక మంత్రి తప్ప అందరూ ఇళ్ళకు పోయారు!

"భల్లూకపతీ! నీవు వూహించింది అక్షరాలా యిలా నిజం అవుతుందని అనుకోలేదు. రాణీగారు ఆ కొండ శిఖరంనుంచి లోయలోపడి, బ్రతికే అవకాశం వుండదా? ఆమె నిజంగా చచ్చిపోయి వుంటుందా? నాకెందుకో అనుమానంగా వుంది. ఆమె బ్రతికే వుండాలి. ఆమె ప్రసవించి వుండాలి. నాకు మగబిడ్డను

ప్రసాదించి వుండాలి. జ్యోతిష్కుల వాక్కులు అబద్ధం ఎన్నటికీ కావు" అన్నాడు మహారాజు.

ఆలోచిస్తూ కూర్చున్నాడు అంతరంగిక మంత్రి.

"భల్లూకపతీ! నా కెందుకో అనుమానంగా వుంది. మహారాణి చావలేదు. బ్రతికే వుంది. పాపం నిన్నరాత్రినుంచీ ఆమె ఆ లోయలో పడి ఎంత దురవస్థ చెందుతోందో! అసలే నిండు చూలాలు! ఆమెకు ఆ లోయలో అంత అర్ధరాత్రి ప్రసవవేదన కలిగి, నొప్పులు పడుతుంటే సహాయం యెవ్వరూ లేరు కాదూ! పాపం అంత ఎత్తుమీదనుంచి అగాధంలో పడిపోతే వెంటనే ఆమెకు చికిత్స చేయటానికి యెవరూ లేరుకదూ! ఆమెకు బిడ్డ పుడితే వాణ్ణి జాగ్రత్తగా కాపాడే వారు లేరుకదూ! అంతా ఆమెను అలాటి స్థితిలో వదిలి వచ్చారు. ఆమెకు తోడుగా యెవ్వరూ లేరు. నేను పోతాను. నా రాణినీ, బిడ్డనూ తెచ్చుకుంటాను" అన్నాడు ఆవేశంతో ముసలి మహారాజు!

"ఆవేశపడకండి మహారాజా! ఆ లోయలో ఆమె పడిపోయిన ప్రదేశం ఇక్కడికి చాలా దూరం వుంటుంది. మన రాజ్యానికి ఆ లోయ పడమటగా వుంది. ఆ లోయ తర్వాత మనుషులు నివసించే పల్లెలు వున్నాయి. అందువల్ల మహారాణి లోయలో పడిపోగానే వెంటనే రాత్రికి రాత్రి మన గూఢచారులు, కొందరు భటులతో, రక్షణమంత్రితో ఆమెను వెతుక్కుంటూ వెళ్ళవలసింది. రాత్రికి రాత్రి ఆమె జాడ తెలిసేది.

"ఒక రాత్రి గడిచాక, ఈ రోజు పగటిపూటవరకూ రాణీగారు కొనవూపిరితో వున్నా, ఆ లోయలోకి వచ్చే గొర్రెల కాపర్లు ఆమెను ప్రాణాలతో విడిచి పెట్టరు. ఏమైనా ఇప్పటికిప్పుడే మన గూఢచారుల్నీ, రక్షణమంత్రినీ, ఒక సైనిక

దళాన్నీ రాణీగారి అన్వేషణకు హుటాహుటిగా పంపుతాను. ఆ తర్వాత భగ వంతుని ఇచ్ఛ!" అన్నాడు భల్లూకపతి.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు బయలు దేరిన గూఢచారి జట్టు సాయంత్రం వేల్టికి లోయ దరి దాపుల్లోకి చేరారు. లోయలో గొర్రెలూ మేకలూ ఇళ్ళకు తిరిగి వెళ్తున్నాయి. గొర్రె కాపరుల అరుపులతో, గొర్రెల అరుపులతో, మేకల అరుపులతో ఆ లోయ సందడిగా వుంది. మసక చీకటికి ముందే పిట్టలన్నీ గూళ్ళకు తిరిగి వస్తూ కిల కిలా రావం చేస్తున్నాయి.

ఇక లోయలో మనుష్యు లెవరూ లేరని రూఢి చేసుకున్నాక గూఢ చారులు లోయంతా గాలించి వెతికారు. ఒక చోట రక్తపు మడుగులో మహా రాణి శరీరం పడి వుంది. గడ్డ కట్టుకుపోయిన రక్తంలో ఆమె శరీరంలోని అవ యవాలను తలకు తల, కాళ్ళకు కాళ్లు, నడుముకు నడుమూ తునా తునకలు చేసి పారేశారు ఎవరో.

అందరూ ఆమె భౌతిక దేహానికి మౌనంగా నిలబడి సైనిక వందనం చేశారు.

విడి విడిగా పడి వున్న అవయవాల ముక్కలను ఒక చోట చేర్చి ఒక రథం మీద వుంచి రాజధానికి తీసుకుపోయారు.

గూఢచారి బృందం వెను దిరిగి వస్తోందని ముసల మహారాజుకు తెలి సింది.

"భల్లూక పతీ మహారాణిని రథం మీద తెస్తున్నారు. మనం ఇంకా ఇక్కడే కూర్చుంటే ఎలా? ఎదురుపోయి మహారాణికి స్వాగతం చెబుదాం. స్వాగతోత్సవా నికి పూర్ణ కలశంతో ఆమెను ఆహ్వానిద్దాం," అంటూ హడావుడి పడ్డాడు మహారాజు.

"ఎవరురా అక్కడ," అని అరిచారు రాజుగారు !

"ఏమి ఆజ్ఞ ప్రభూ." అంటూ వచ్చారు భటులు.

"త్వరత్వరగా నగర వీథుల్లో మామిడి తోరణాలూ, రంగు కాగితాల తోరణాలూ కట్టించండి. ప్రతి వీధిలోనూ స్వాగతం చెప్పే పెద్ద పెద్ద ప్రకటనలు వేయించండి. ప్రతి ఇంటి మీద రంగు రంగుల జండాలు కట్టించండి. దారికి రెండు వైపులా అరటి స్తంభాలతో, కొబ్బరి ఆకులతో అలంకరించండి. స్వాగతం చెప్పే సమయానికి బాజా భజంత్రీలను ఏర్పాటు చేయండి. మహా రాణి గారు తిరిగి నగరంలో ప్రవేశించే ఈ శుభ సందర్భంలో ప్రజలందరినీ, ఆనందంతో ఉత్సవం చేయవలసిందిగా నా ఆజ్ఞ," అన్నారు మహారాజు !

"త్వరపడకండి మహారాజా ! మన నిర్ణయాలు ఒకటిగానూ, దైవ నిర్ణయాలు మరొక రకంగానూ వుంటాయి !", అన్నారు భల్లూకపతి.

అప్పటికి మృగేంద్రులు మామూలు స్థితికి దిగి వచ్చారు, తమ ఆవేశం తగ్గించు కున్నారు.

గూఢాచారుల బృందంతో రక్షణమంత్రి మహారాజును సమీపించి ," ప్రభూ ! మహారాణి మృత దేహాన్ని తీసుకు వచ్చాము. ప్రాణంతో ఆమెను తెచ్చే అదృష్టం మాకుదక్కలేదు," అని ఆజ్ఞకోసం, వేచినిలచాడు.

"దైవనిర్ణయం అలావుంది. ! సమస్త రాజ లాంఛనాలతోనూ మహారాణి గారిభౌతిక దేహానికి అంత్యక్రియలు జరిపించండి. ఒక వారం రోజుల పాటు రాజ్యంలో సంతాప సూచకంగా ప్రభుత్వ పతాకాలు క్రిందకి దించి ఎగుర వేయండి. ప్రజలను నల్లటి గుడ్డ పీలికలు తమ దుస్తులకు ధరించవలసిందని చెప్పండి. ఈ సంతాప వారంలో ఉత్సవాలను, వేడుకులను, విందులను రద్దు

చేయండి. ఆమె ఆత్మ శాంతికి దేవాలయాల్లో ప్రార్థనలు జరపండి", అంటూ ఉత్తరువులు జారీ చేశారు మహారాజు.

"దేవుడా! మా ఆయనకు మంత్రి పదవి వచ్చిన దగ్గర్నుంచీ దిన దిన గండం నూరేళ్ళ ఆయుస్సు లాగా వుంది స్వామీ! ముఖ్య మంత్రి పదవికి ముందు పిచ్చి ఎత్తిందనే అనుకున్నాను. కానీ ఇప్పుడు నిజంగానే పిచ్చెత్తింది.

"రాణీగారు చచ్చిపోయి దయ్యమై పట్టింది. అందుకే ఎప్పుడూ మహారాణీ మహారాణీ అంటూ అరుస్తాడు. ఈయనకు పిచ్చి తగ్గేట్టు చేయి స్వామీ" అంటూ అడవిలో వుండే వన దుర్గకూ, వన దేవతలకూ మొక్కుకుంటోంది. ముడుపులు కడుతోంది కుటిలుని భార్య!

కుటిలుని పిచ్చి చేష్టలకు అందరూ బాధ పడుతున్నారు. పది కాలాల పాటు బాగు పడి సుఖంగా వుండ వలసిన ముఖ్యమంత్రికి పిచ్చి పడితే బాధగా వుండదూ మరి!

పిచ్చి తగ్గించటానికి వైద్యుల్ని పిలిపించింది అతని భార్య! ఒకవేళ ఇవి భూత చేష్టలేమోనని భూత వైద్యులను కూడా పిలిపించింది!

రోజూ రాత్రి పూట రంగుల ముగ్గులు వేయటం, కోళ్ళను కోయటం, కోడి గుడ్లు కొబ్బరి కాయలు పగల గొట్టటం, నిమ్మకాయలు కోయటం జరుపుతున్నారు.

పిచ్చి కుదిర్చే వైద్యులు వచ్చి కుటిలునికి ముందుగా బోడి గుండు చేశారు. నెత్తి మీద అందంగా వుండే జుట్టంతా కత్తిరించారు!

ఏవేవో చేదు రసాలు తెచ్చి గొంతులో పోస్తుంటే కుటిలునికి వొళ్ళు

మండిపోయి, "మీకు పిచ్చి మీ భార్యలకు పిచ్చి, మీ అమ్మలకూ, నాన్నలకూ పిచ్చి, నాకేం పిచ్చి లేదు", అని అరిచి అందరినీ చావగొట్టి విడిచాడు.

ఆ రోజు అమావాశ్య కూడా అయింది!

"అందుకే పిచ్చి ముదిరింది! ఈయనగారి పిచ్చికి ఈ మందులు చాలవు. రేపటి నించీ ఇంకా ఘాటయిన మందులు వాడాలి", అన్నారు వైద్యులు.

కదలకుండా చేతులూ కాళ్లూ కట్టేశారు! కదలకుండా ఒక గుంజకు కట్టేశారు కుటిలుణ్ణి.

పాపం! ఆ కట్లతో వొళ్ళంతా నొప్పులు పుడుతోంది! రాత్రి పూట మొగుడి నోట్లో అన్నం పెట్టాలనుకుంది కుటిలుని భార్య! చేతులూ కాళ్ళు కట్టేశారు గాబట్టి అతడు స్వయంగా తినలేడు కదా!

నోట్లో పెడుతుంటే చేతి వేళ్ళను కొరికి పారేస్తాడేమో! అసలే అమావాస్య రాత్రి!

"ఆకలి! ఏమేవ్! నీ దుంప తెగ. అన్నం పెట్టవేవ్! ఈ కట్లన్నీ విప్పదీయవేవ్!", అంటూ అరిచాడు కుటిలుడు! ఆ బాధ పడలేక నిజంగా ఏడుపు కూడా వచ్చింది!

"నీకు దణ్ణం పెడతానే! ఇంత అర్ధ రాత్రి దాకా నా కడుపు మాడ్చి చంపకే! ఆకలి వేస్తోంది! ఈ కట్లు విప్పవే" అన్నాడు: బ్రతిమాలాడు, ఏడ్చాడు!

అయినా అతడి నోట్లో అన్నం పెట్టాలంటే భయం వేసింది. పోనీ కట్లు విప్పదీస్తే! అమ్మో! ఇంకేమైనా వుందా? అసలే అమావాస్య రాత్రి అందరినీ

కొరికి చంపుతాడు అనుకుంది ఆమె !

నీకో సంగతి చెబుతాను. ఇంట్లో ఎవరైనా మేలుకొని వున్నారా? అని రహస్యంగా భార్యను పిలిచాడు.

"అందరూ నిద్ర పోతున్నారు" అంది ఆమె !

"దగ్గరకు రావే. నీకో రహస్యం చెబుతానూ" అని భార్యను పిలిచాడు.



"ఓసి నీ నోరు పడా ! భయం లేదు దగ్గరకు రావే ! నాకేం పిచ్చి ఎత్తలేదే ! అంతా నటన ! మహారాణి గారు చచ్చిపోతే నిజంగా నాకు పిచ్చి ఎత్తిందని అందరూ అనుకోవాలి ! ఈ సంగతి రాజుగారికీ తెలియాలి ! అందుకే ఇలా నటిస్తున్నాను. అన్నాడు. ఆమె ఆశ్చర్యపోయింది.

"ఎందుకు అలా నటించాలి. ఏం ఖర్మ పట్టింది" అని అడిగింది.

"ఒసే! ఈ రాణీగారి యాత్ర నా ప్రోద్బలంతో జరిగింది. అసలీ యాత్రకు ఆ భల్లూకమూ, రాజూ మొదట అంగీకరించలేదు. నా పట్టుదల వల్ల రాణీగారికి యాత్ర చేయాలని మనసు కలిగింది, అందువల్ల ఈ యాత్రలో ఆమె చచ్చిపోతే, ఈ యాత్రకు కారణ భూతుణ్ణి అయిన నన్ను మహారాజు అనుమానిస్తాడు. రాజుగారి నమ్మిన బంటు, ఆ ఎలుగు బంటుగాడు, వున్నాడే, ఆ ఆంతరంగిక మంత్రి, అతగాడు కూడా రాజుగారి అనుమానాన్ని ఇంకా బల పరిచి నా మీద ఎలాగో కసి తీర్చుకొనే ఏర్పాటు చేస్తాడు. అందుకే ఇటు ప్రజలందరికీ మహారాణి మీద నాకు గల గౌరవం చాటుకోటానికీ, అటు రాజు గారిక్కూడా నా మీద జాలి కలగటానికి ఈ ఎత్తు వేశాను.

"నన్ను పుట్టి పుణ్యానికి మందులూ మాకులూ పోసి చంపకు. నన్ను విడిచి పెట్టు, అని బ్రతిమాలుకున్నాడు.

ఆశ్చర్య పోయింది అతగాడి భార్య!

"అందుకే మీకు ముఖ్యమంత్రి పదవి వచ్చింది," అంది అతన్ని అభి నందిస్తూ! కానీ ఒక సందేహం ఆమెకు కలిగింది! "ఒక్కసారిగా పిచ్చితగ్గిపోతే అందరూ అనుమానిస్తారు. అదెలా?" అనుకుంది! ఆయనతో చెప్పింది.

ఒక్కక్షణం ఆలోచించాడు.

ఒక్క మెరుపులా ఆలోచన తోచింది!

"నాకురాత్రి వనదుర్గాదేవి కల్లో కనిపించింది. వందకోళ్ళనూ, వంద గొఱ్ఱెలనూ బలియిస్తే నీ మొగుడి పిచ్చి రేపీపాటికే తగ్గిపోతుందని వనదుర్గ అభయం యిచ్చింది. అని అందరికీ చెప్పి పెద్ద ప్రచారం చేయించు. రేపు పగ లంతా వనదుర్గకు జాతర చేయించు. అందరికీ కడుపునిండా కల్లుపోసి తాగించు. మేకల్ని, గొర్రెల్ని కోళ్లనూ కోయించి అమ్మవారికి నైవేద్యం పెట్టి ప్రసాదం

అందరికీ పంచు. దానధర్మాలు చేయి. నన్నుకూడా కాళ్లూచేతులూ కట్టి అమ్మ వారి గుడికి వాహనంమీద తీసుకుపో! అప్పుడు అందరూ నీపతి భక్తిని, దైవ భక్తినీ మెచ్చుకుంటారు. ఆ రాత్రిపూట ఇంట్లో అందరినీ పిలిచిభజనచేయించు! తల్లీ నీలో మహాత్మ్యం వుంటే మొగుడి పిచ్చి తగ్గించు. నీవు కలలో చెప్పినట్లు అన్నీ చేశాను. ఇక నీ సత్యం చూపించి నీ భక్తుణ్ని కాపాడు. పిచ్చి కుదిరించు, అంటూ అందరిముందూ అమ్మవారికి మొక్కు. వా చేతికీ కాళ్ళకూ వున్న కట్లు విప్పతీస్తే ఎంతవరకూ పిచ్చిగా అరుస్తూ, పిచ్చిలక్షణాలు చూపిచే వాణ్ణికాస్తా ఒక్కసారిగా మంచిగా మారిపోతాను. అందరూ ఇది అమ్మగారి సత్యంగా భావించి ఆశ్చర్యపోతారు. ఈ సంగతి రాజుగారికీ తెలిసి నీకుగల భక్తికి సంతోషిస్తాడు. నన్నుకూడా ఎప్పటివలె గౌరవిస్తాడు," అంటూ తన పథకం చెప్పాడు.

ఎగిరి గంతేసింది అతని భార్య !

అతడు చెప్పినట్లుగా అక్షరాలా ఆ మర్నాడు ఆచరించింది! కుటిలుడి పిచ్చికాస్తా తగ్గిపోయింది! ఈ అద్భుతం రాజుగారిక్కూడా తెలిసింది.

"కుటిలునికి పిచ్చికుదిరింది," అన్నారు మహారాజు ఆంతరంగిక మంత్రితో

"మహారాజా! కుటిలునికి పిచ్చిఎత్తిందని మనం అనుకోవటం, అతడి పిచ్చి తగ్గిందని సంతోషించటంవల్ల మనం పిచ్చివాళ్ళం అయిపోతాం," అన్నాడు భల్లూకపతి !

ఆశ్చర్యంగా"ఏం ?" అన్నారు మహారాజు !

"మహారాజా! నిన్నటి అమావాస్యరాత్రిపూట ఇంట్లో అందరూ నిద్ర పోతున్నట్లు తెలుసుకొని, అసలు రహస్యం అంతా భార్యతో చెప్పాడు కుటిలుడు ! ఈ పూజలూ, వనదుర్గ కొలువులూ అంతా దగా, మోసం! అమాయ

కుల్ని నమ్మించటానికి వేసిన రాజకీయపు ఎత్తు! ఈ రహస్యం కుటిలుని ఇంటో దాసిగా వుంటూన్న మన గూఢచారిణి నిద్రపోతున్నట్లు నటిస్తూ అంతా విన్నది.

"మహారాజా! ఇంతేకాదు. ఇక మీద కూడా కుటిలుడు చేయబోయే అద్భుతాలు మీరు చూస్తారు. అతగాడి దురాలోచన నీకు చాలా పెద్ద వ్యవధిని అందించుదాం. ఏమీ ఎరగనట్లు వూరుకుందా! అతడి రాజకీయపు పన్నాగపు వుచ్చులో అతడే ఇరుక్కొనేలా చేదాం." అన్నాడు భల్లూకపతి!

## 12

మహారాజుగారి ఆశలన్నీ హరించిపోయాయి!

ఒక కొడుకు పుడతాడనీ, అతన్ని చూసి ఈ వృద్ధాప్యంలో అమితమైన ఆనందం పొందాలనీ ఆశించాడు!

భార్య చనిపోయింది!

మరి కుమారుడో, కుమార్తె పుట్టిందో! పుట్టిన బిడ్డ ఏమయినట్లు?

అసలు శిశువు పుట్టిందో, రాణితో సహా ఆమె కడుపులోనే వుండి చని పోయిందో!

ఒకవేళ పుట్టినా —

తల్లి చనిపోయాక ఆ శిశువును ఎవరు రక్షిస్తారు! అందులోనూ క్రూర మృగపు పుల్లమీద ఎవరికి జాలి వుంటుంది! ఏ గోరెల కాపరో, ఇంకేదైనా మరొక అడవి జంతువో ఆ శిశువును చంపేసి వుండాలి!

ఇలాటి ఆలోచనలతో మృగేంద్రునికి జీవితం మీద విరక్తి భావం కలిగింది.

ఎవరి కోసం జీవించాలి ?

ఎవరి కోసం ఈ సంపద, ఈ రాజ్యాధికారమూ ?

ఇలాటి విరక్తి భావంతో మహారాజు తన మిగిలిన జీవితాన్ని ధ్యానంలో గడపాలని అనుకున్నాడు.

"భగవంతుని ధ్యానంలో శేష జీవితం గడిపే రాజుకు ఇంకా రాజ్యాధిపత్యం దేనికి ?" అనుకున్నాడు.

ఒకరోజున అంతరంగిక మంత్రి అయిన భల్లూకపతిని పిలిచి "నేను ఈ సింహాసనాధిపత్యం వదిలి ఎటైనా గుహల్లోకి పోయి భగవంతుని గూర్చి తపస్సు చేసుకుంటాను. జీవితంలో భోగాలన్నింటినీ అనుభవించాను. నాకు ఎవ్వరూ 'నా' అనేవారు ఇపుడు లేరుకదా !" అన్నాడు.

"మహాప్రభూ ! మీరే ఇలా అంటే ఎలా చెప్పండి ! ప్రజలంతా మీకు బిడ్డలు కారా ? మీ సర్వస్వం ఇంతవరకు ప్రజల క్షేమం కోసం ధారపోశారే, ఇప్పుడు మీరు ప్రజలను విడిచినా ప్రజలు మిమ్మల్ని విడవరు.

"భగవంతుని ధ్యానం చేసుకోవటానికి గుహల్లో ముక్కు మూసుకొని కూర్చోవాలా ? రాజమందిరంలోనే మీరు హాయిగా భగవంతుని ధ్యానంలో కూర్చోండి ! మిమ్మల్ని ఎవ్వరూ చూడవలసిన అవసరం లేదు. నేను తప్ప ఇంకెవ్వరూ మీ దర్శనం చేసుకోలేరు ! రాజమందిరంలోని సేవకులకు కూడా మీరు ఇంట్లో ఏం చేస్తున్నదీ తెలీకూడదు. మీకు మాత్రం రాజ్యంలో ఏం జరుగుతుందో ఎప్పటి కప్పుడే నా ద్వారా తెలుస్తూ వుంటాయి.

"ఇది ఒక రకంగా ఒక గొప్ప రాజకీయపు పన్నాగం ! ఇందువల్ల ఇప్పుడిప్పుడే తల యెత్తుతున్న స్వార్థ శక్తులు ఎలాటి చిత్రమైన పోకడలు పోతాయో మీరూ నేనూ ప్రజలూ కళ్లారా చూడొచ్చు" అన్నాడు భల్లూకపతి !

ఈ సూచన మృగేంద్రులకు చాలా నచ్చింది!

ఇందుకు తగినట్లుగా ఒక రాజపత్రం ద్వారా ఉత్తరువులు జారీ చేశారు.

"ఇక మీదట సమస్తమైన రాజ వ్యవహారాలలోనూ మహారాజుగారి అంతరంగిక మంత్రి గారయిన శ్రీ భల్లూకపతిగారికి సర్వాధికారాలూ ఇవ్వడమైనది.

మృగేంద్రులమైన మాతో ఇంతవరకూ మంత్రులూ ప్రజలూ ఎలా సహకరిస్తున్నారో ఇక మీదట వారితోనూ ఇదే రీతిగా సహకరించగలరని ఆశిస్తున్నాను. ఏ విషయాల్లో నయినా శ్రీ భల్లూకపతిగారిదే తుది నిర్ణయంగా వుంటుంది" అంటూ ఆ పత్రం మీద సంతకం చేసి మంత్రులకు, ప్రభుత్వ అధికారులకూ అందజేశారు మృగేంద్రులు!

అందరికీ ఈ చర్య ఆశ్చర్యం కలిగించింది!

"రాజుగారు భార్య పోయిందన్న మనస్తాపంలో వున్నారు. అందుచేత కొంతకాలం విశ్రాంతి తీసుకుంటారు."

"ఇకనించీ భల్లూకపతి పరపతి పెరిగి పోతుంది. ఆయన క్రింద మంత్రులందరూ అణిగి మణిగి వుండాలి కామాలు."

ఇలా అనుకో సాగారు మంత్రులు, ప్రజలు.

*                    *                    *

కుటిలునికి కొన్ని రోజుల నుంచీ రాత్రిళ్ళు నిద్ర పట్టటం లేదు! ఎప్పుడూ అదే పనిగా ఆలోచిస్తూ వుంటాడు. విసుగూ, కోపం రెండూ ఎక్కువయ్యాయి. మాటి మాటికీ విసుగు కోపడం ఎక్కువయింది. చీటికీ మాటికీ పెళ్ళాం పిల్లల్ని కూడా కేకలు వేయటం, చీవాట్లు పెట్టటం కూడా అధికమైంది!

పూర్వం అతడి ఇల్లు సాదాగా వుండేది.

ఇప్పుడు అదొక దివ్య భవనం అయింది. ఇంట్లో దాస దాసీలు ఎక్కువయి నారు. చాలా ఖరీదైన గుడ్డలు. నగలూ పెట్టుకుంటున్నారు భార్యాబిడ్డలు!

"ఆహా! మా ఆయన ఎంత గొప్పవాడు. రెండు చేతులా సంపాదిస్తు న్నాడు. ఇలాగే మా ఆయన సంపాదిస్తే ఈ రాజ్యంలో రాజుగారి తర్వాత మేమే కోటీశ్వరులం అవుతాం," అనుకునేది కుటిలుని భార్య మొదట్లో!

డబ్బు సంపాదన కూడా ఎంత పెరిగిందో కుటిలుడు కూడా మానసికంగా అంత మారిపోతున్నాడు.

రాత్రిళ్లు చాలా ఆలస్యంగా ఇంటికి వస్తాడు. అందరినీ విసుక్కుంటాడు!

ఈ మార్పు సహించ లేకపోయింది భార్య!

"ఈమధ్య మీరుబొత్తిగా మారిపోయారు! మీకు మాపొడకూడా గిట్టటం లేదు. మీరిలా తయారవటం నాకిష్టం లేదు" అంది కోపంగా కుటిలుని భార్య!

"ఇష్టం లేకపోతే నువ్వుకూడా ఆ రాజుగారి భార్యలాగా లోయలో పడి చావు. నా పనులకూ, ఆలోచనలకూ అడ్డురాకు" అన్నాడు కోపంగా!

"ముఖ్యమంత్రి అయిన దగ్గర నుంచీ మీరిలా మారి పోతున్నారు. రాజులు చపలచిత్తులు అంటారు. వారికి ఆగ్రహం వచ్చినంత సేపు పట్టదు అను గ్రహం కలగటానికి. అలాగే అనుగ్రహం కలిగినంత సేపు పట్టదు ఆగ్రహం రావ టానికి కూడా! అంచేత ఎప్పటి కప్పుడే ఏవో సరికొత్త రాజద్రోహాలూ, నేరాలూ చేయక పదవితో పాటు మర్యాద కూడా నిలబెట్టు కోండి" అంది కోపంగా.

"తెలివి తక్కువదానా! ఎవడే రాజు! ఆ ముసలి రాజుగారు భార్యా వియోగంతో మతి తప్పి మంచం ఎక్కారు. రాజ్య వ్యవహారాలు స్వయంగా చూసుకోలేని స్థితిలో అధికారాన్ని ఆ భల్లూకపతికి సమర్పించాడు. అతడేం నిర్వాకం చేస్తాడు? పోనీ ఆ ఇచ్చే అధికారాలేవో మన రక్షణమంత్రీ, రాజు తర్వాత

రాజంతటి సేనాధిపతి అయిన వ్యాఘ్రేంద్రునికి ఇస్తే ఎంత బాగుండేది. పెద్ద పులికి దటిసినట్లు ఎలుగుబంటుకు ఎవరు దడుస్తారు ?

"ఇప్పుడా ఎలుగుబంటుగారి పరిపాలన నడుస్తోంది! కొద్ది రోజుల్లోనే రాజ్యంలో అల్లకల్లోలాలు సృష్టించి, రాజును తోసి రాజుచేసి, అధికారాన్ని నా మాట వేదంలా వినే బుద్ధిమంతుడికి ఇప్పించుతాను. అంతేకాదు. నా వాణ్ని మహారాజ పదవిలోకి ఎక్కిస్తాను.ముసలిరాజుగారు తప్పనిసరిగా సింహాసనం దిగే గతి పట్టిస్తాను.

"అపుడు నేనే ఈ రాజ్యానికి కిరీటం లేని మహారాజును ! అధికారం నాది! ఐశ్వర్యం నాది ! నాకు అడ్డు తగిలిన ప్రతి ఒక్కనికీ రాణీగారికి పట్టిన గతి పట్టిస్తాను" అన్నాడు కుటిలుడు గర్వంగా తన భార్యామణితో !

ఆ ఇల్లాలు నోరు మెదపలేదు !

# 13

నిండు గర్భిణి అయిన మహారాణి ఆనాడు కొండచరియనుంచి లోయలో పడిపోయింది.

పడటం పడటం ఒక బండరాతిమీద తల్లక్రిందులుగా పడటంతో ముందు తలకు బాగా దెబ్బతగిలి తల పగిలిపోయింది. గర్భానికి ఏ మాత్రమూ దెబ్బ తగలలేదు. ఈ అదురుపాటుకు గర్భంలోని శిశువు బయట పడ్డాడు.

ఈ అద్భుతాన్ని గొర్రెలను ఇంటికి తోలుకుపోతున్న ఒక గొర్రెలకాపరి చూశాడు. మొదట్లో అతడికి భయం కలిగింది! కానీ ఆడసింహం ఆ రీతిగా ఒక శిశువును కని చచ్చిపోవటం అతనికెంతో జాలి కలిగించింది !

తల్లి కడుపులోనుంచి బయటపడిన సింహంపిల్ల చచ్చిపోయిన తల్లి ప్రక్కనే నేలమీదపడి కాళ్ళు చేతులూ, ముద్దు ముద్దుగా కదుల్చుతోంది!

ఆ సింహ కూనను చూడగానే అతని గుండె కరిగిపోయింది.

"పాపం! తల్లి లేని బిడ్డ! మనిషి అయితేనేం, పశువయితేనేం? తల్లిలేని బిడ్డ ఎలా బ్రతుకుతుంది! దేవుడా కొందరు జీవుల్ని ఇలా కష్టాలలోనే ఎందుకు పుట్టిస్తావు తండ్రీ! ఈ మూగ జీవాలు ఇలా బాధ పడుతుంటే నీకు వినోదంగా వుంటుందా?" అనుకున్నాడు!

సింహంపిల్ల దగ్గరకుపోయి చూశాడు. చిన్ని చిన్ని జులపా జుట్టుతో, చిన్ని చిన్ని చేతులతో, కాళ్ళతో బొద్దుగా, ముద్దుగా వుంది సింహపుపిల్ల!

దాని శరీరానికి గల మైలనూ, రక్తాన్నీ ఆకుల్తో తుడిచి శుభ్రం చేశాడు!

వెంటనే గొర్రెపాలు పితికి ఆకుదొప్పతో దాని నోట్లో పోశాడు. అది మెల్లగా గుటకలు వేస్తూ గొర్రెపాలు మింగింది.

ఒక ప్రక్క చీకటి ముంచేసుకొస్తోంది!

చీకటి పడితే లోయలోకి తోడేళ్ళు, ఇంకా ఏవైనా క్రూర మృగాలొస్తాయి. అంచేత త్వర త్వరగా గొర్రెల్ని తోలుకొని, సింహం పిల్లని భుజం మీద పడుకో బెట్టుకొని ఇల్లు చేరుకొన్నాడు.

అతడి భార్య, సింహం పిల్లను ఇంట్లో దింపటం చూసి బెదిరిపోయింది!

"ఇదింకా సరిగ్గా కళ్ళుకూడా తెరవలేదు. బొద్దు వూడలేదు! పుట్టగానే గొర్రెపాలు తాగింది! దీనివల్ల నీకేం భయమూ వుండదు! ఇదీ మన మేకల్తో, గొర్రెల్తో ఒకటిగా గడ్డితిని బ్రతుకుతుంది" అన్నాడు అతడు!

"నాకేదో భయంగా వుందండి! ఈ సింహంపిల్ల పెద్దదై మన గొర్రెల్ని,

మనల్ని నంచుకు తింటుంది! ఇది క్రూర మృగం! దీన్ని పెంచటం ఏమిటండీ! ఎవరైనా నవ్వుతారు," అంది!

"అంత భయందేనికే! ఇది గడ్డి తింటూ మేకల్తో తిరుగుతూ వున్నంత కాలం మనల్ని ఏమీ చెయ్యలేదు, రక్తమాంసాల రుచి తెలీకుండా దీన్ని పెంచితే అది ఎంత పెద్ద సింహం అయినా మేకలాగే 'మేమే' అంటూ బ్రతుకుతుంది. మనిషయినా అంతే! చిన్నతనం నుంచీ ఎలాటి వాతావరణంలో పెరిగితే అలా తయారవుతాడు. పుట్టుకతో క్రూర జంతువే అయినా పెంపకంలో అది పిరికి దానిలాగానే తయారవుతుంది! జన్మతో ఏదీ మంచిదీకాదు, చెడుదీకాదు. మంచి చెడులు మనిషి చేసుకున్న తేడాలు. పైగా ఈ సింహం చాలా విశ్వాసం కల జంతువు! దీని గుణాలుకూడా చాలా గొప్పవి! అందుకే దీన్ని మృగాలలో రాజు అన్నారు. పాలు పోసి, ప్రాణం ఇచ్చి, పెంచిన మనుషుల్ని చంపటం సింహానికి చేతకాదు! అది ఎంత క్రూర జంతువో అంత కరుణగల జంతువు" అన్నాడు గొర్రెల కాపరి!

అతని భార్యకు ఇదంతా విన్నాక కాస్త ధైర్యం కలిగింది!

ఆ సింహంపిల్ల ఆ ఇంట్లో అడుగుపెట్టి నప్పటినుంచీ గొర్రెల కాపరి దశ తిరిగిపోయింది! గొర్రెలూ మేకలూ పిల్లల్ని పెట్టి రెట్టింపు లాభంకూడా వచ్చింది. సంవత్సరం తిరగగానే అతడికి ఒక మగ బిడ్డకూడా కలిగాడు!

అంచేత సింహం పిల్లనుకూడా తన సొంత బిడ్డలాగా పెంచుతున్నాడు. అతడు. అదికూడా ఒక పెంపుడు జంతువులా ఆ యింట్లో పెరుగుతోంది! దాని వల్ల అతని అదృష్టం కలిసివచ్చింది.

గొర్రెలతో తిరిగి 'బీబీ' అంటం, మేకలతో తిరిగి 'మేమే' అంటం బాగా కుదిరింది సింహం పిల్లకు.

దానికి త్వరలోనే మేకల భాష, గొర్రెల భాష కూడా వచ్చేశాయి!

# 14

గొర్రె పిల్లలతో కలసి పెరుగుతున్న సింహం పిల్లకు వయస్సు పెరుగుతున్న కొలదీ ఏవో సందేహాలు వస్తున్నాయి.

ఆకలి అయినప్పుడు మేకపిల్లలూ గొర్రెపిల్లలూ తల్లుల దగ్గరకు పోయి కడుపునిండా పాలు తాగేవి. తల్లులుకూడా తమ బిడ్డల దగ్గరకు వచ్చి పాలిచ్చేవి. అలా తల్లుల దగ్గర పాలు తాగే గొర్రెపిల్లల్ని చూస్తే సింహం పిల్లకు అసూయ కలిగేది.

"నాకు అమ్మ ఎవరు? నేను మా అమ్మదగ్గర పాలు తాగనేం? అమ్మ నా దగ్గరకు వచ్చి పాలివ్వదేం ?" ఇలా అనుకో సాగింది.

"అమ్మా ! నాకు ఆకలి వేస్తోందె ! నా దగ్గరకు రావే ! పాలివ్వవే." అంటూ ఏడ్చేది.

దానికి ఆకలి అయినప్పుడు ఒక దోనెతో పాలు తెచ్చి మెల్లిగా దానినోట్లో పోసేవాడు గొర్రెల కాపరి. ఆకలికి గుట గుటా మింగేది అది.

ఒకరోజు దానికో ఆలోచన తట్టింది.

ఒక గొర్రె దగ్గరకు పోయి, "మా అమ్మ కనిపించటం లేదు. నువ్వే మా అమ్మవనుకుంటాను. నిన్ను అమ్మా అని పిలుస్తాను. పాలిస్తావా ?" అని అడిగింది సింహం పిల్ల.

"నీ నోరు పడిపోను, నేను నీకు తల్లిని ఎలా అవుతానే? నీ తల్లి ఎప్పుడో చచ్చిపోయింది. నీది దురదృష్టపు జాతకం. పుడుతూనే తల్లిని చంపుకున్నావు. నన్ను అమ్మా అని పిలిస్తే నేనుకూడా చస్తానేమోగానీ ఆ పని చేయబోకు. నీకు అమ్మా నాన్నా చచ్చారు," అంది గొర్రె.

"నేనుకూడా చచ్చిపోయి మా అమ్మ దగ్గిరికీ నాన్న దగ్గిరికీ వెళ్తాను. చావటం ఎలా?" అని అడిగింది!

గడ్డిమేస్తున్న గొర్రెకు సింహంపిల్ల ప్రశ్నలు తలనొప్పి కలిగించాయి. విసుగు పుట్టించాయి.

"నీ చొప్పదంటు ప్రశ్నలకు సమాధానం చెప్పే తీరిక లేదుగానీ మీ యజమానిని అడుగు. నీకు తగిన సమాధానం ఇస్తాడు" అంది గొర్రె.

సింహం పిల్లకు గడ్డి తినా లనిపించలేదు. పాలు తాగాలని లేదు.

దిగులుగా ఒకచోట కూర్చోటం మొదలు పెట్టింది. ఇది కనిపెట్టాడు గొర్రెకాపరి.

"ఏమ్మా! గడ్డి తినటం లేదేం! పాలు తాగటం లేదేం. కడుపులో నెప్పిగా వుందా?" అని అడిగాడు సింహం పిల్లను యజమాని అయిన గొర్రెలకాపరి.

ఆ రాత్రి ఇంటికి పోయాక సింహంపిల్ల నోట్లో ఆరు పసరు పోస్తూవుంటే సింహం పిల్లకు భయం వేసింది.

"నాకు మందు పోయొద్దు. నేను చచ్చిపోతాను. నాకు అమ్మా నాన్నా కావాలి. నన్నూ వాళ్ళ దగ్గరకు పంపండి," అంటూ ఏడ్చింది సింహం పిల్ల.

"ఓసి పిచ్చిదానా! నీకు అమ్మ మీదా నాన్న మీదా దిగులు పుట్టిందా?" అని అడిగింది యజమానురాలు.

తల వూపింది సింహం పిల్ల.

"దానికి అమ్మ దిగులు పట్టి పాలు మానేసిందండీ. కడుపులో జబ్బువల్ల కాదు" అంది భర్తతో.

"నీకు అమ్మను నేను. నాన్న ఈయన మేమిద్దరం నీకు అమ్మానాన్నలం. దిగులుపడకు, పాలు త్రాగి, కడుపునిండా గడ్డితిను" అంటూ దాన్ని ఒళ్ళోకి

తీసుకుని వీపుమీద ప్రేమగా అరిచేత్తో నిమురుతూ కూర్చుంది. నిజంగా అమ్మ ఒడిలో కూర్చున్నట్లే అనిపించింది సింహం పిల్లకు.

*    *    *

ఒకరోజు సింహం పిల్లా, మేక పిల్లలూ కలసి రాజూ, బంటూ ఆట ఆడుతున్నాయి.

"నేను మీ అందరికీ రాజును. మీరు నాకు బంటులు!" అంది సింహం పిల్ల!

"ఓ అలాగే. నువ్వు మాకు రాజువి. మేము నీకు బంటులం," అన్నాయి మేకపిల్లలూ, గొర్రె పిల్లలూ.

"బంటులందరూ రాజుగారి ఆజ్ఞ నెరవేర్చాలి."

"ఒ అలాగే మీ ఆజ్ఞ నెరవేరుస్తాం"

"అయితే మీరంతా పోయి మా అమ్మనీ నాన్ననూ వెతుక్కురావాలి" అని అన్నది సింహం పిల్ల.

గొర్రె పిల్లలూ, మేక పిల్లలూ తమాషాగా అటూ ఇటూ వెదికాయి. చెట్టు చాటునా పుట్ట చాటునా వెదికాయి. రాజుగారి తల్లీతండ్రి కనిపించటం లేదు.

"రాజా! మీ అమ్మా నాన్నా కనిపించటం లేదు" అని చెప్పాయి బంటులు రాజుతో.

"రాజుగారి ఆజ్ఞ నెరవేర్చలేము కాబట్టి మీ అందరినీ చంపేస్తాను చూడండి" అంటూ అరిచింది సింహం పిల్ల.

ఈ ఆటకు గొర్రె పిల్లలన్నీ సంతోషంగా ఎగిరి గంతేశాయి. అయితే ఒక

మేకపిల్లకు నిజంగా భయం పుట్టి దాని తల్లితో చెప్పింది. "అమ్మా అమ్మా" అని ఏడ్చింది.

మేక తల్లికి కోపం వచ్చి మొగుడితో చెప్పింది. అప్పుడు మేకపోతు గాంభీర్యం ప్రదర్శించుతూ సింహం పిల్ల దగ్గరకు చాలా కోపంతో వెళ్ళింది.

మేకపోతు గాంభీర్యం చూసి సింహం పిల్లకు అదురు, వొణుకూపుట్టాయి!

"దుర్మార్గుడా ! మా పాలు తాగుతూ, గతిలేక మా అండ చూసుకుని బతుకుతూ, మా బిడ్డల్ని చంపుతావా ! నీవు నా బిడ్డలకు రాజువా ? వాళ్ళు నీకు బంటులా ? మా పిల్ల పోయి నీ చచ్చిన తల్లిదండ్రులను వెదికి తేవాలా ? లేక పోతే మా పిల్లల్ని చంపుతావా ?, చూడు నిన్నేం చేస్తానో," అంటూ మేక పోతు సింహం పిల్ల మెడమీద జూలును నోటితో పట్టుకుంది.

"బాబోయ్ నన్ను చంపకండి, వూరికే ఆటల్లో అలా ఆడుతున్నాం. నిజంగా నేను రాజును కాను. నేనూబంటునే. మీ అందరికీ బంటును. మీరంతా ఏం చెబితే అది చేస్తాను. మీరు చెప్పింది చేయకపోతే నన్ను చంపేయండి. మీకు దణ్ణంపెడతాను. విడిచి పెట్టండి," అని ఏడ్చింది.

"అలా దోవలోకిరా. జాగ్రత్తగా వుండు. ఇంకోసారి మా పిల్లల్ని భయపెట్టావో నీ తోలు వొలిచేస్తాను. జాగ్రత్త అంటూ కేకలు వేసింది మేక పోతు.

సింహం పిల్లకు, మేకల్నీ గొర్రెల్నీ వొదిలి ఎటైనా పారి పోవాలనిపించింది. కానీ ధైర్యం చాల లేదు.

"దీన్ని వూరికే కేకలు వేసి విడిచి పెడితే చాలదు. ఒకసారి గట్టిగా అవమాన పరిచి సిగ్గు పడేలా చేయాలి. దీని ముఖాన అందరూ కలసి వుమ్మేయాలి. అంది మేకపిల్ల తల్లి !

మేకలూ, గొర్రెలూ అన్నీ కలసి సింహం పిల్ల ముఖాన వుమ్మేశాయి.

ఈ అవమానం భరించలేక కళ్ళు మూసుకుంది సింహం పిల్ల.

సింహం పిల్లను ఇలా అవమాన పరిచినందుకు మేకలూ,గొర్రెలూ నిజంగా ఎంతో గర్వించాయి!

"దాని పొగరు అణిగింది. ఇహనించీ దాని నోటికి వచ్చినట్టుగా మన పిల్లల్ని బెదిరించదు" అంది గర్వంగా మేకపోతు !

"ఏమో ! అసలే సింహం జాతి పిల్ల! ఇంతవరకు మన యజమాని దాన్ని కూడా మన పిల్లలతో పెంచటం వల్ల అదీ ఒక గొర్రె పిల్లలాగా పెరుగుతోంది. అయినా అది ఏదో ఒకరోజున దాని నిజరూపం తెలుసుకుంటుంది. అప్పుడు అదే నిజంగా మనల్ని అందరినీ ఈ పగ లోపల పెట్టుకొని, చీల్చి చెండాడుతుంది. అసలీ రోజు నుంచీ మన పిలలు దానితో ఆడుకోవటానికి వీల్లేదు." అంది మేక. సరే అన్నాయి మిగతా మేకలన్నీ, గొర్రెలన్నీ కూడా తలవూపుతూ అవు నన్నాయి!

సింహం పిల్ల ముఖం కడుక్కోటానికి దగ్గర్లో వున్న నీటి గుంట దగ్గరకు పోయింది.



ముఖం కడుక్కోటానికి నీళ్ళలోకి దిగింది. ఆ నీళ్ళలో తన ప్రతిబింబం చూసుకొంది. దాని గంభీరమైన ముఖం, మీసాలూ, తలనించీ వీపు మీదకు పడుతున్న తెల్లని జులపాలు, తీక్షణంగా చూసే కళ్ళు ఆనీళ్ళలో కనిపించాయి.

ముఖం కడుక్కొని ఇంకోసారి తన ప్రతిబింబం చూసుకుంది. తన రూపం తాను చూసుకోగానే దాని శరీరంలో ఏదో విద్యుత్తు ప్రవహించినట్లు అనిపించింది.

ఒకసారి దూరంగా కనిపించే గొర్రెల్నీ, మేకల్నీ పరీక్షగా చూసింది. ఇంకోసారి నీటిలో తన ప్రతి బింబము చూసుకుంది.

ఇలా తన రూపాన్నీ, గొర్రెల రూపాన్ని చూసుకుంది. ఈ రూపాల్లో ఏదో తేడా కనిపించింది!

"నిజంగా నేను గొర్రెనేనా ? నేను మేకనేనా ? నేనెవర్ని ?" అని చాలా సార్లు ప్రశ్నించుకుంది.

పోయి గొర్రెల్నీ, మేకల్నీ అడగాలనుకుంది. అసలే వాళ్లు కోపంగా వున్నారు. యజమానినే అడిగి తెలుసుకుంటాను అనుకుంది.

# 15

రాత్రి ఇంటికి పోయాక యజమానితో యజమానురాలితో జరిగిందంతా చెప్పింది. జరిగిన అవమానం తలుచుకొని ఏడ్చింది.

సింహం పిల్లకు రెండు సంవత్సరాలు వెళ్ళి మూడో ఏడు వస్తోంది.

దాని అవయవాలన్నీ చక్కగా పెరుగుతున్నాయి. జూలు దట్టంగా పెరి

గింది. ముందు కాళ్ళకు పంజా బాగా పెద్దదయింది. వేలికోళ్ళు ఇనప కొక్కెల లాగా వంకర తిరిగి వున్నాయి. శరీరం కూడా దృఢంగా పెరిగింది.

"దీని పుటక గడ్డితిని పాలుతాగుతూ పెరిగితేనే ఇంత దృఢంగా తయారయిందే! అసలు మాంసంతింటూ రక్తంతాగుతూ, బతికితే ఈ పాటికి ఇంకా ఎలా వుండేదో," అనుకుంది యజమానురాలు.

ఎంతకాలం ఇలా దీన్ని పెంచగలం!

ఈ రీతిగా ఈ గొర్రెలూ మేకలూ దీన్ని రెచ్చకొడుతూ వుంటాయి! జాతి వైషమ్యాలు తేలిగ్గా పోయేవికావు ఏదో ఒకరోజున ఈ సింహానికి కోపం వచ్చి చీలపంజాతో గొర్రెపోతు ముఖం పగిలేట్లుగా కొడుతుంది. దాని రక్తాన్ని పొరపాటుగానయినా రుచిచూస్తుంది. అప్పుడు రక్తదాహంతో ఇది గొర్రెలన్నింటినీ తినేస్తుంది, అనుకుంది యజమానురాలు.

యజమానీ, యజమానురాలూ కలిసి కాస్సేపు అస్పష్టంగా ఏదో గుసగుస లాడుకున్నారు వేరేగదిలో.

సింహంపిల్ల పెద్దదవుతోంది, అది జన్మతః క్రూరజంతువుకాబట్టి, దానిని ఒక కంటితో జాగ్రత్తగా కనిపెట్టివుండాలనీ, తమబిడ్డనుకూడా దానితో చనువుగా ఆడుకోనీయ కూడదనీ నిర్ణయించారు.

వాళ్ళిద్దరూ సింహంపిల్ల దగ్గరకు తిరిగి వచ్చేసరికి, వాళ్ళ అబ్బాయి సింహంతో ఆడుకుంటున్నాడు. సింహం వీపుమీద ఎక్కి "చల్ చల్ సింహం" అంటూ దాన్ని నడిపించుతూ ఆడుతున్నాడు.

సింహంపిల్ల ఎంత సాత్వికంగా ప్రస్తుతం ప్రవర్తిస్తున్నా, ఇకమీదట దానికి ఏమాత్రం కష్టమూ, బాధ కలిగినా అదిఎదురుతిరిగి కసితీర్చుకుంటుందనే భయం యజమానికి కూడా కలిగింది.

"బాబూ ! ఈ రోజునుంచీ సింహంవీపుమీద ఆడుకో వద్దు !దానికి నడుం నొప్పి కలిగించంటే అది నిన్ను కరుస్తుంది. జాగ్రత్త" అన్నాడు యజమాని కొడుకుతో !

"యజమాని కొడుకును కరిచేటంత క్రూరుణ్ణికాను ! మే ఇద్దరం ఇలా చిన్నప్పటి నుంచీ ఆడుకుంటున్నా ! ఇది మాకు కొత్తకాదుగా," అంది సింహం పిల్ల.

అయినాసరే గొర్రెల కాపరి తన కొడుకును సింహ వీపునుంచి కిరిదకు దించి, ఇకనించి అలా ఆడుకో వద్దన్నాడు.

సింహంపిల్ల బాధపడింది.

"మీరుకూడా నన్ను అవమాన పరుస్తున్నారా ? ఈ రోజు ఉదయం మేకలూ,గొర్రెలూ నన్ను అవమాన పరిచాయి ! అలాగే మీరూ నన్ను పరాయి దాన్నిగా చూస్తున్నారు, నేనంటే భయపడుతున్నారు ! ఇంతకూ నేనెవర్నో చెప్పండి ! నేనూ మేకనా ? గొర్రెనా ? ఇంకెవర్ని ?" అని అడిగింది.

"నీవు దురదృష్ట వంతుడివి. గొర్రెలాగా బతుకుతున్న సింహానివి ! బానిసలాగ బ్రతికే మహాప్రభువువి !" అన్నాడు యజమాని !

సింహం పిల్లకు ఇదేం అర్థం కాలేదు.

"గొర్రెలాగా బ్రతుకుతున్న సింహానివి. బానిస లాగా బ్రతికే మహా ప్రభువువు." ఈ మాటలే సింహం పిల్లకు పదేపదే మనస్సులో మారుమ్రోగాయి.

"నేను గొర్రెను కాదు. సింహాన్ని. నేను బానిసను కాను. ప్రభువును. నేను పిరికివాణ్ని కాను, మహావీరుణ్ని", అనుకుంటూ నిద్ర పోయింది సింహం పిల్ల !

ఆ రాత్రి దానికి ఓ తమాషా కల వచ్చింది.

గొర్రెపిల్లకూ దానికీ ఏదో పేచీ వచ్చింది. ఒక గొర్రె పోతు తరపున సింహం పిల్లతో పోట్లాడింది. అలా పోట్లాడటంలో గొర్రెపోతు గొర్రెపిల్ల తన కొమ్ములతో సింహం పిల్లను 'ఢీ' కొట్టి క్రింద పడేసి, కుమ్మింది.

సింహం పిల్లలో ఏదో అగ్ని పర్వతం పగిలి పోయినట్లు అనిపించింది. ఆ అవమానాన్ని, కోపాన్ని భరించలేక ముంజేతి పంజాతో గొర్రెపోతు ముఖాన ఒక దెబ్బ తీసింది. అంతే గొర్రెపోతు ముఖం పగిలి నెత్తురు కారింది. దాని నెత్తురుని త్రాగి, వేడి వేడి మాంసాన్ని తినేసింది. దాని మాంసం నోటికి ఎంతో రుచిగా వుంది. అదే రుచిని అనుభవించటం కోసం ఇంకా నాలుగైదు మేకల్ని కూడా చంపి తినేసింది. గొర్రెల మీద, మేకల మీద పగ సాధించింది.

దాని వొళ్ళంతా నెత్తురుతో తడిసింది. విజయగర్వంతో సింహం పిల్ల యజమానురాలి దగ్గరకు వచ్చి ఆమె పాదాల ముందు మోకరిల్లింది! దాని మూతికి, వొంటికి రక్తం మరకలు చూసి, "అమ్మో! ఈ పాడు సింహం మన పిల్లవాణ్ని చంపి తినేసింది బాబోయ్" అంటూ గావుకేక పెట్టింది ఆమె!

కొడుకును సింహం పిల్ల చంపి తినేసిందనే భ్రాంతితో యజమాని కూడా దానిని చంపటానికి, ఒక కత్తిని విసిరాడు. సింహం పిల్ల తప్పించుకోటానికి "రక్షించండి! నేను మీ పిల్లవాణ్ని చంపలేదు! నన్ను అవమానం చేసినందుకు ఈ గొర్రెల మీద పగ సాధించాను. అంతే! నన్ను చంపకండి! నేను మీ దాసుణ్ని." అంటూ అరిచింది సింహం పిల్ల!

కలకాస్తా కరిగి పోయింది.

"భగవంతుడా! యజమాని చెప్పింది నిజమేనా? నేను బానిసలాగే బ్రతికే ప్రభువునే అయితే, నాకీ దుస్థితి ఎప్పుడు తొలగి పోతుంది? నేను నిజంగా ఎప్పుడు ప్రభువు నవుతాను?" ఇలా దుఃఖించింది.

# 16

మహారాణిగారు పోయి మూడేళ్ళయింది.

మహారాజుగారు పరిపాలను భల్లూకపతికి అప్పగించి మూడేళ్ళయింది.

ఈ మూడేళ్ళలోనూ ముఖ్యమంత్రిగా కుటిలుడు చాలా సంస్కరణయి చేశాడు. దానివల్ల ప్రజలకు క్షేమం సుఖం కలుగక పోగా బాధలు నానాటికీ ఎక్కువయి పోయినై.

పైగా కుటిలుడు నమ్మించి మోసంచేసే విద్యలో చాలా అరితేరిన వాడు కదా!

"నేనేం చేసినా మీ సుఖం కోసం, నేనేం చేసినా మీ బాగు కోసం. మీ కోసం చావమన్నా చస్తాను.," ఇలా ప్రతిచోటా ప్రజలను పోగుచేసి, వారి కష్ట సుఖాలు విచారిస్తూ, వారి బాధలకు సానుభూతిగా ఒక్కొసారి కన్నీరు కూడా కారుస్తూ వుండేవాడు.

"మహారాజుగారు తమ సుఖం చూసుకుంటూ మందిరంలోనే కూర్చుంటు న్నారు! పైగా అసలు మహారాజుగారి ముఖం చూసి మూడేళ్ళు దాటింది. వారు బ్రతికి వున్నారో, కన్ను మూసి మరో లోకంలో వున్నారో ఎవరికీ తెలియదు.

"ఈ అయోమయ పరిస్థితుల్లో సర్వాధికారాలూ చేత చిక్కించుకొని కూర్చోవటం తప్ప భల్లూకపతి కూడా మీ శ్రేయస్సు కోసం ఏమీ చేయటం లేదు. తన స్వార్థం చూసుకుంటూ, మీ కష్ట సుఖాలను పట్టించుకోకుండా వుంటున్నాడు.

"ఇలాటి పరిస్థితుల్లో మీరంతా నాకు అండగా నిలబడితే మన శ్రేయస్సు కోరే వాణ్ణి, మనకు రాజుగా ఎన్నుకునే ఏర్పాటు చేస్తాను. అప్పుడు మీ కష్టా

లన్నీ పోతాయి. సుఖంగా బ్రతుకుతారు." ఇలా రహస్యంగా కొన్ని కొన్ని చోట్ల ప్రజలతో మాట్లాడాడు కుటిలుడు !

"మీకు మా అండ ఎప్పుడూ వుంటుంది. మీరేం చేసినా మేం సమర్థిస్తాం" అంటూ ప్రజలంతా హామీ ఇచ్చారు.

ఈ రీతిగా పరపతి సంపాదించుకున్నాడు కుటిలుడు.

ఈ రీతిగా మహారాజుమీదా, భల్లూకపతి మీదా, దుష్ప్రచారం కూడా చేయటం ప్రారంభించాడు.

* * *

ఈ రాజ్యానికి సింహం తర్వాత పెద్దపులి రాజుగా వ్యవహరించటానికి తగిన అభ్యర్థి అనుకుంది ఆ నక్క !

అందుకే వ్యాఘ్రపతిని ఉబ్బించటం, పొగడటం ప్రారంభించాడు కుటిలుడు ! కుటిలుని పొగడ్తలకు పొంగిపోయాడు రక్షణ మంత్రిగా వుంటున్న వ్యాఘ్రపతి.

"మీ చేతుల్లో సైనిక బలం అంతా వుంది ! మీరు తలుచుకుంటే మీ సేనల్ని మహారాజు మీదికీ, భల్లూకపతి మీదికీ ప్రయోగించగలరు ! ఈ రాజ్యంలో ఇప్పుడు మన ఇరువురిదీ పై చేయి. ప్రజలూ, మిగతా మంత్రులూ అందరూ ఒట్టి తెలివితక్కువ దద్దమ్మలు. మనం ఏది చెబితే అది నమ్ముతారు. ఏం చేసినా అంగీకరిస్తారు. మీరు 'వూ' అనండి ! మిమ్మల్ని సింహాసనంమీద కూర్చోబెడతాను. మీ శ్రేయస్సు కోసం ఇలా చెబుతున్నాను. ఇంకొకరితో ఇలా చెప్పను." అన్నాడు కుటిలుడు.



"అవును. కంటికి కనిపించకుండా అంతఃపురంలో కూర్చునే మహారాజు వున్నా లేకపోయినా ఒక్కటే! ఆయన బ్ర కి వున్నదీ, చచ్చిపోయిందీ కూడా తెలీని రీతిగా భల్లూకపతి చాలా కట్టుదిట్టాలు చేశాడు.

"భల్లూకపతి పరిపాలనలో ప్రజలు చాలా కష్టపడుతున్నారు! ఈ మూడేళ్ళలోనూ ధర్మం మూడు పాదాలు నష్టమై పోయింది. ఇంకో సంవత్సరం ఇలాగే గడిస్తే అధర్మం పూర్తిగా రాజ్యం చేస్తుంది. దీనికి కారకుడు అంతరంగిక మంత్రి అయిన భల్లూకపతి! అతని అంతం చూసి, ప్రజల శ్రేయస్సుకోసం ప్రజల సుఖం కోసం అవసరం అయితే నేను మహారాజ పదవిని అలంకరిస్తాను. పరిపాలనా భారాన్ని నా నెత్తిన వేసుకుంటాను." అన్నాడు వ్యాఘ్రపతి!

అతనికి నిజంగా ప్రజలు పడేకష్టాలకు చాలా బాధకలిగింది.

"అవును, తన స్వార్థంకోసం పదవిని దుర్వినియోగం చేస్తున్న భల్లూకపతి, ప్రజలను దోచుకుంటున్నాడు. ప్రజలు ఈ విపత్తును భరించలేక హాహాకారాలూ చేస్తున్నారు. మీరే నిజంగా ప్రజల శ్రేయస్సును కోరితే, వెంటనే మన ఆలోచనలకు కార్యరూపం ఇవ్వండి." అన్నాడు కుటిలుడు.

వ్యాఘ్రపటంతో సమానంగా కుటిలుడు వ్యవహరిస్తూ అతనితో కలసి రహస్యంగా ప్రజల దగ్గరకు పోయి ఉపన్యసిస్తూ వున్నాడు. తన ఉపన్యాసాల వల్ల ప్రజల మనసుల్లో చాలా మార్పు తెచ్చి, వారి అభిమానాన్ని తనవైపు తిప్పుకుంటున్నాడు. చారలు చారలుగా వున్న ఒక పెద్దపులి చర్మాన్ని తెప్పించి దానితో వొళ్ళంతా కప్పుకొని, పెద్దపులి లాగా తానూ కనిపించాలని ఎంతో అవస్థ పడ్డాడు కుటిలుడు.

"పులిని చూచి నక్క వాతలు పెట్టుకుందిట! పులి తోలు కప్పుకు తిరిగితే నక్క పులి అవుతుందా?" అనుకున్నారు కొందరు పెద్దలు!

* * *

రాత్రి సమయాల్లో తోడేళ్ళు, చిరుతపులులూ విజృంభించాయి. నిద్ర పోతున్న మృగాల మీదపడి చంపేయటం, పిల్లల్ని ఎత్తుకుపోయి చంపుకు తినటం ఎక్కువయిపోయింది అడవి రాజ్యంలో. ఇలా కుటిలుడే చేయిస్తున్నాడు!

ఈ కష్టాలను ఎలుకల దగ్గరనుంచి ఏద్దులవరకూ అనుభవిస్తున్నాయి.

రాజనేవాడు లేడు కాబట్టి, కుటిలుడు తమ కష్టాలను శ్రద్ధగా వింటున్నాడు కాబట్టి అడవిలో జంతువులన్నీ, ఒక అర్జీ తయారుచేసి కుటిలుని వద్దకు వెళ్ళాలని నిర్ణయించాయి, ఇంతలో కుటిలుడే వచ్చాడు వారి దగ్గరకు.

"ఎలుకల్లారా! మీరు సామాన్యులు కారు, సాక్షాత్తు విఘ్నేశ్వరునికి మీరు వాహనాలు! విఘ్నేశ్వరునితో పాటు మీకూ మొదటగా నమస్కరించక పోతే, ఎవరిపనీ నిర్విఘ్నంగా నెరవేరదు!

"కుక్కల్లారా! మీరు చాలా గొప్పవారు. మీ చరిత్ర ఘనమైనది! కాల భైరవస్వామి లేకపోతే ఈ రాజ్యాలూ, పట్టణాలూ, పల్లెలూ లేనేలేవు! కాల

భైరవుడు వీటిని కాపాడే మహానుభావుడు. మీరంతా ఆయన వంశంలోని వారు !

"కోతుల్లారా ! మీరు లేకపోతే రామాయణం లేదు. శ్రీరామచంద్రుడంతటివాడు లంకకుపోయి సీతను తెచ్చుకొనే వాడు కాడు మీరు లేకపోతే! మీరంతా కీర్తిగాంచిన కిష్కింధాపురం అగ్రహారీకులు !

"ఎద్దుల్లరా ! మీరు తక్కువవాళ్ళా! సాక్షాత్తూ సాంబశివుడు మీ ఎద్దు మీదే ఎక్కి తిరుగుతూ వుంటాడు. మీరు ధర్మ దేవతకు ప్రతినిధులు ! మీరు తలుచుకుంటే ధర్మం అడుగంటి పోయిన ఈ రాజ్యంలో తిరిగి ధర్మాన్ని నిలబెట్టగలరు !

"దున్నపోతుల్లారా ! అన్నలారా ! మీరు లేకపోతే యమధర్మరాజు సైతం దేనిమీద ఎక్కాలో తోచక తికమక పడేవాడు! మీరు ఎండనీ వాననీ లెక్కచేయని మహాయోగులు. ద్వంద్వాలకు అతీతులు!

"ఈ రీతిగా చరిత్ర ప్రసిద్ధి చెందిన మీవంటి మహాను భావులంతా మెదలకుండా వూరుకోబట్టే మన రాజ్యంలోని మన ప్రజలూ ఇలా అగచాట్లు పాలవుతున్నారు.

"పోయిన నిద్ర చాలు! ఇప్పటికయినా మేలుకొని సరైన రాజును ఎన్నుకొనకపోతే మనతోపాటు ఈ కష్టాలు ఆగవు ! మన బిడ్డలూ తరతరాలా బాధ పడతారు.

"లేవండి అందరూ ఒకటిగా నిలవండి. మంచి పరిపాలన కోసం, మంచి పరిపాలకుని కోసం మీ సర్వస్వాన్నీ త్యాగం చేయటానికైనా సిద్ధంగా వుండండి."

ఈ రీతిగా కుటిలుని ఉపన్యాసాలు నిద్రపోతున్న ప్రజల్లోని చైతన్యాన్ని మేల్కొలిపాయి !

* * *

# 17

"మహాప్రభూ! కుటిలుని కుతంత్రాలు మితి మీరి పోయినై. ప్రజల్లో పెద్ద పెట్టున విప్లవం తెస్తున్నాడు. మీరు చచ్చిపోయారనీ, నేను నా స్వాధికారాలతో నా పదవికోసం ప్రజల క్షేమాన్ని బలిచేస్తున్నాననీ రహస్యంగా ప్రచారం కూడా చేస్తున్నాడు. వ్యాఘ్రపతి కూడా ఇదంతా నిజమేనని నమ్మి, ప్రజల క్షేమంకోసం తాను రాజ్యపాలనా భారాన్ని నెత్తిన వేసుకొని సింహాసనం ఎక్కాలని ఆశిస్తున్నాడు" అన్నాడు భల్లూకపతి!

"అతని కుట్రలూ కుతంత్రాలూ అతన్నే నాశనం చేస్తాయి." అన్నారు మృగేంద్రులు.

"మంచి పరిపాలన మాటల్లోకంటె చేతుల్లో చూపించాలి! మాటలు నేర్చిన కుటిలుడు, తన వాక్చాతుర్యంతో ప్రజలను ఎంతకాలం మోసం చేస్తాడు! నిజానిజాలు ప్రజలకు తెలిసే రోజు త్వరలోనే వస్తుంది" అన్నారు మృగేంద్రులు.

మృగేంద్రులకు "జయము జయము" అంటూ ప్రవేశించాడు ఒక గూఢచారి.

"మహాప్రభూ! ఈ వార్త వినండి!" అంటూ ఆదుర్దాగా చెప్పాడు అతడు.

మృగేంద్రులూ, భల్లూకపతి ఆసక్తితో "ఏమిటా వార్త!" అని అడిగారు!

"మృగేంద్రా! భగవంతుడు మిమ్మల్ని కనికరించాడు! యువరాజా వారు బ్రతికే వున్నారు. గొర్రెల్లో ఒక గొర్రెగా, మేకల్లో ఒక మేకగా పచ్చిగడ్డితింటూ, పాలు తాగుతూ ఒక గొర్రెలకాపరి దగ్గర పెరుగుతున్నారు" అని చెప్పాడు.

మహారాజు ఆ వార్త విని పరవశం చెందారు.

"యువరాజా వారిని చూశావా. వారితో మాట్లాడావా? ఎలా వున్నారు? నన్ను గురించి తలచుకుంటున్నాడా?" అని అడిగారు మహారాజు.

"మహారాజా! నాకు యువరాజా వారితో మాట్లాడే అవకాశం కుదరలేదు. గొర్రెల్ని అడిగాను. అవి జరిగిన కథంతా చెప్పాయి. ఎంత క్రూర జంతువయినా మచ్చిక చేసి పెంచితే మాలిమి చేసుకుంటే ఎంతో సాధుజంతువులా పెరుగుతుంది. గొర్రెలకూ మేకలకూ మాత్రం యువరాజావారి మీద గుర్రుగా వుందని అర్థం చేసుకున్నాడు. అవన్నీ ఈ మధ్యనుంచీ యువరాజా వారితో మాట్లాడటం లేదనీ, అతన్ని చూస్తేనే వాటికి భయం పుడుతోందనీ, యువరాజా వారు ఎటైనా పారిపోయి నట్లయితే తమకు సుఖంగా వుంటుందనీ ఆ గొర్రెలు చెప్పాయి" అన్నాడు గూఢచారి !

ఆ గూఢచారి ఎవరోకాదు. రాణీగారు పెంచిన పెంపుడు పావురం! ఆ పావురం ఇంతవరకూ అంతఃపురం దాటి బయటకు పోలేదు! నాలుగు రోజుల క్రితం ఆంతరంగిక మంత్రిగారి ఆదేశం మీద రహస్యంగా రాజ్యంలో జరిగే కొత్త వింతలు తెలుసుకుంటూ, పడమటి దిశలో వున్న లోయదాకా వెళ్ళింది. ఆ లోయలో రాణీగారు మరణించిన ప్రదేశం చూసింది. తర్వాత ఆ దాపుల్లోనే గొర్రెల మందతో వున్న యువరాజా వారిని చూసింది !

ఆ రాత్రే రహస్యంగా మృగేంద్రులూ, భల్లూకపతీ పడమటి లోయలోకి వెళ్ళారు.

ఆ మర్నాడు మామూలుగా గొర్రెలకాపరి తన మందలను తోలుకు వచ్చాడు. ఆ మందల్తో పాటే చాలా గంభీరంగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్న యువరాజును చూశారు మృగేంద్రులూ భల్లూకపతి !

"మహారాజా! యువరాజు అచ్చగా తమ పోలికే! పరిస్థితులకు దాసుడై

ఈ గొర్రెల మందతో గడ్డితింటూ బ్రతుకుతున్నాడు. తమ తమ తావులు తప్పి పోతే ఎవరైనా ఇలాగే విలువ లేకుండా బ్రతుకుతారు!" అన్నాడు భల్లూకపతి!

"యువరాజును తిరిగి సింహాసనం మీద కూర్చోపెట్టే ఏర్పాటు వెంటనే చేయాలి. అప్పుడు అతని విలువ ఏమిటో ఈ నక్కలకూ, కుక్కలకూ తెలుస్తుంది." అన్నారు మహారాజు! రాజభోగాలు అనుభవిస్తూ వుండవలసిన యువరాజావారు ఇలా ఒక అల్పుడుగా బ్రతకటాన్ని చూసి సహించలేక పోయారు మహారాజు! ఎంతో బాధపడ్డారు. లోయంతా దద్దరిల్లిపోయేలా గర్జించారు.

ఆ గర్జనకు భయపడి గొర్రెల కాపరీ, తన గొర్రెలతో, మేకలతో పారిపోయి ప్రాణాలు దక్కించుకోవాలని ప్రయత్నించాడు!

సింహంపిల్ల కూడా గొర్రెలను అనుసరించిపారిపోతోంది. ఒక్క దూకులో దాన్ని చేరి గట్టిగా పట్టుకున్నారు మృగేంద్రులు!

"నిన్ను చూస్తే నాకు భయం వేస్తోంది, వదులు, నేనూ పారిపోయి ప్రాణాలు దక్కించుకుంటాను. ఎప్పుడూ ఈ వైపు గడ్డిమేయటానికిరాను.నన్ను వదులు" అంటూ ప్రార్థించింది సింహంపిల్ల.

అంతలో భల్లూకపతి అక్కడకు వచ్చాడు.

"నీవు నీ తండ్రిని చూసి భయపడుతున్నావా! తప్పుకాదూ!" అన్నాడు భల్లూకపతి యువరాజునుచూసి.

ఆశ్చర్యంగా తండ్రివంక చూసింది సింహంపిల్ల.

"అవును! నీ రూపం నా రూపం ఒకటే!" అంది సింహంపిల్ల!

"అంతేకాదు నాయనా! నీవు నేనూ ఒకటే! నేను నీ తండ్రిని. నీవు నా బిడ్డవు, నీ కోసమే చచ్చిపోకుండా బ్రతికివున్నాను. నాతో రా బాబూ! ఈబానిస

బ్రతుకు వదలి రాజులాగా బ్రతుకు. ఈ పిరికి బ్రతుకువదలి హాయిగా. ధైర్యంగా మాతో బ్రతుకు " అన్నాదు మృగేంద్రుడు.

"అవును. మా యజమాని కూడా ఇలాగే అన్నాడు. నేనెవరిని అని అడిగాను. బానిసగా బ్రతికే మహాప్రభువువు అన్నాడు. నేను నిజంగా ప్రభువునా?" అని అడిగింది సింహంపిల్ల.

"అవును" అన్నాడు మహారాజు !

"మరి ప్రభువుకు బలం వుండాలి, ధైర్యం వుండాలి. నేను బలహీనుణ్ణి. నేను పిరికివాణ్ణి. ఎలా ప్రభువును కాగలను" అని అడిగింది సింహంపిల్ల !

మహారాజునవ్వాడు. తర్వాత చెవులు వగిలేట్లుగా గర్జించాడు. అలా చాలా సేపు గర్జించాడు. ఆ గర్జనకు చెట్ల మీద పిట్టలు కూడా భయపడి ఎగిరి పోయాయి.

సింహంపిల్లలో అప్పటిదాకా దాగిన పౌరుషం పెల్లుబికింది. తండ్రి గర్జిస్తుంటే దానికీ అలాగే గర్జించాలని మనసుపుట్టింది. అంతే! అదికూడా గర్జించింది. దాని గర్జనకూ లోయ మారుమోగింది.

"చూశావా ! నువ్వూ నాలాగే గర్జించావు. ఇంతవరకూ మేకలో, గొర్రెల్లో పెరిగావు కనుక అలాగే నీవూ ఒక గొర్రెవలె మేకవలె బ్రతికావు. కానీ నీ లోపల దాగివున్న పౌరుషం, శౌర్యం ఎక్కడికి పోతాయి! నన్ను చూడగానే నీలోని సహజ లక్షణాలన్నీ వెలికి వచ్చేశాయి. ఇకనించి నీవు సింహంపిల్లవు మాత్రమే కాదు. యువరాజువు " అన్నాడు మృగేంద్రుడు.

యువరాజావారూ సంతోషంతో ఉప్పొంగిపోయారు.

"తండ్రీ! నన్ను కన్నబిడ్డవలె పెంచిన యజమానినీ, యజమానురాలినీ ఒకసారి చూసివస్తాను'' అన్నారు యువరాజు!

"నాయనా ! ఇప్పుడు ఆ గొర్రెలనూ, ఆ మనుషులనూ చూడలేవు. ఒక వేళ నీవు చూడాలని వెళ్ళినా నీలో వచ్చిన ఈ మార్పు చూసి నీకు భయపడి నిన్ను ఏదో విధంగా చంపాలని చూస్తారు. నీవిప్పుడు మేకవూ, గొర్రెవీ కావు. క్రూర మృగాలకు రాజువు!" అన్నాడు మృగేంద్రుడు.



యువరాజావారి కోరిక ప్రకారం భల్లూకపతి ఆ రాత్రి రహస్యంగా గొర్రెల కాపరి ఇంటికివెళ్ళాడు. రహస్యంగా విలువగల మణులను, రత్నాలనూ అతని ఇంట్లో పడవేశాడు. ఇవన్నీ ఎందుకు పడేస్తున్నావు అంది ఒక చిట్టెలుక.

"మీ ఇంట్లో పెరిగిన సింహంపిల్ల, మా రాజ్యానికి కాబోయే మహారాజు !

ఆయనగారి ఆజ్ఞప్రకారం మీ యజమానికి ఈ అమూల్యమైన బహుమతులు అందిస్తున్నాను," అని వెళ్ళిపోయాడు భల్లూకపతి!

తర్వాత ఈ విషయం తెలుసుకున్న గొర్రెలకాపరీ, అతని భార్య ఎంతో సంతోషించారు. సింహంపిల్లను పొగడారు!

# 18

ఆ రోజు రాజమందిరం ముందు కుటిలుడు, వ్యాఘ్రపతి, ఇతరమంత్రులూ, ప్రజలూ అశేషంగా హాజరయినారు.

"ప్రజాద్రోహులు నశించాలి! ప్రజల శ్రేయస్సు పెంపొందాలి," అంటూ ప్రజలంతా నినాదాలు చేస్తున్నారు!

అందరినీ నిశ్శబ్దంగా వుండవలసిందిగా ప్రార్థించాడు కుటిలుడు.

ఇంత అలజడి జరుగుతుంటే రాజుగారు బ్రతికివుంటే బయటకు వస్తారు. లేదా భల్లూకపతి అయినా బయటకు వస్తాడు కదా అని అందరూ ఆశించారు.

అలాగే భల్లూకపతి రాజమందిరంలోనుంచి బయటకువచ్చాడు. రాజుగారు రాలేదు!

"అంతరంగిక మంత్రి నశించాలి. ముఖ్యమంత్రి వర్ధిల్లాలి. ప్రజలకు అన్యాయాలు చేసే అంతరంగికమంత్రి నశించాలి. ప్రజల శ్రేయస్సును కోరే ముఖ్యమంత్రి వర్ధిల్లాలి," అంటూ ప్రజలు కేకలు వేశారు.

"ఏమిటి అలా గుడ్లు అప్పగించి చూస్తారు! ప్రజలకు సమాధానం చెప్పండి! వారి కడుపు మంటను చల్లార్చండి!" అంటూ కుటిలుడు వ్యంగ్యంగా భల్లూకపతిని ఎత్తిపొడుస్తున్నట్లుగా అడిగాడు.

"మహాప్రజలారా ! మీకు ఎంతకాలంనుంచీ ఈ మంత్రి చెప్పే కడుపు మంటలు ప్రారంభించాయి ?" అని అడిగారు అంతరంగికమంత్రి !

"మీకు సర్వాధికారాలూ దక్కినప్పటినుంచీ మా అగచాట్లకు అంతులేదు."

"వాటికి బాధ్యులెవరు ?"

"మీరే! మీరే బాధ్యులు! మహారాజుకూడా బ్రతికేవుంటే వారూబాధ్యులే! ప్రజలను ప్రజల అగచాట్లకు వదిలేసి మీ పదవులను మీరు అంటిపెట్టుకున్నారు ! మీరు స్వార్థపరులు" అన్నారు ప్రజలు.

"మేంచేసిన నేరాలేమిటి ?" అని అడిగాడు భల్లూకపతి !

"ప్రజల ఆస్తులను కొల్లగొట్టుకోవలసిందిగా బందిపోటు దొంగలను ప్రోత్సహించారు. రాజ్యంలో అవినీతిని పెంచారు. అన్యాయాలను అరికట్టలేకపోయారు" అన్నారు ప్రజలు.

"కాబట్టి, ఇలాటినేరాలు చేసిన వారికేం శిక్ష విధిస్తారో చెప్పండి" అని అడిగారు అంతరంగిక మంత్రి !

"మరణ శిక్ష విధిస్తాం ! అన్నారు ప్రజలు.

"తర్వాత ?"

"వ్యాఘ్రేంద్రులను ఈ రాజ్యానికి మహారాజుగా సింహాసనం ఎక్కిస్తాం" అన్నారు ప్రజలు.

"అలాగే శిక్షించండి ! మీకు ద్రోహం చేసిన ప్రజాద్రోహులు నశించాలి. అదే నేనూ కోరేది ! మీ దృష్టిలో నేనే ద్రోహినని తోస్తే మీరు నన్ను చంపేయండి. ఆ తర్వాత మీ ఇష్టం వచ్చిన వారిని మీరు మహారాజుగా ఎంచుకోండి," అంటూ తలవంచుకు నుంచున్నాడు భల్లూకపతి !

"అంతరంగిక మంతిని చంపండి, నరకండి, ఉరి తీయండి," ఇలా అరుస్తూ అతని మీదకు విరుచుకు పడటం ప్రారంభించారు!

"ప్రజలారా! త్వరపడకండి! నిజంగా మీకు జరిగిన అన్యాయాలకు బాధ్యత అంగీకరించటం వల్లనే ఈనాడు భల్లూకపతి తలవంచుకొని తన నేరాల్ని అంగీకరిస్తూ మీరు విధించే శిక్షకు వొప్పుకుంటున్నాడు. చూశారా!" అన్నాడు కుటిలుడు.

"భల్లూకపతి నశించాలి! కుటిలుడు వర్ధిల్లాలి! మహారాజుగా వ్యాఘ్రేశ్వరులు వర్ధిల్లాలి," అంటూ ప్రజలు నినాదం చేస్తూ వుండగా—

అందరి గుండెలూ ఆగిపోయేట్లు,
అందరి ధైర్యమూ జారిపోయేటు,
అందరి భ్రాంతులూ తొలగిపోయేట్లు —
సింహ గర్జనలు వినిపించాయి!

అక్కడ సమావేశం అయిన ప్రజలంతా పారిపోబోతూ వుంటే, వ్యాఘ్రేంద్రులు వారి ఎదుటకు వచ్చి "పారిపోకండి! ఈ వాడు మీకు నిజంగా సుదినం! ఇన్ని సంవత్సరాలుగా మనం కలలు కంటున్న మంచిరోజు వచ్చింది! మన యువరాజావారు రాజ్యాధికారం చేపట్టటానికి మన రాజధానికి తిరిగి వచ్చారు," అంటూ యువరాజును అందరికీ చూపించారు.

ప్రజలంతా జయజయ ధ్వానాలు చేశారు రాజుగారిని చూసి! రాజుగారిని చూశాక ఆయన మీద గల కోపం అంతా పోయింది వాళ్ళకు!

మెల్లిగా జారుకుంటున్న కుటిలునీ, కుటిలునితో పాటు తప్పించుకోవాలని ప్రయత్నించే అతని అనుచరులనూ ఎక్కడి వారి నక్కడే నిర్బంధించేశాడు వ్యాఘ్రేశ్వరుడు!

* * *

# 19

యువరాజా వారి పట్టాభిషేకం జరుగుతోంది. రాజ్యంలోని ప్రజలంతా పట్టాభిషేక ఉత్సవంలో పాల్గొన్నారు. ఉత్సవానికి ఏర్పాట్లను చాలా అందంగా, చాలా ఆనందంగా చేయించారు రక్షణమంత్రి అయిన వ్యాఘ్రేశ్వరుడు, అంత రంగిక మంత్రి అయిన భల్లూకవతీ!

"మీరింత కాలమూ మీకు జరిగే అన్యాయాలకు నిజంగా బాధ్యులెవరో గుర్తించలేక పోయారు! మీ శ్రేయస్సు కోసం రాత్రింబవళ్ళు పాటు పడు తున్న అంతరంగిక మంత్రిని నేరస్థురాలుగా అనుమానించారు! అది పూర్తిగా కుటిలుడు మీకు చేసిన దుర్బోధలకు ప్రతిఫలం! మీకు జరిగిన అన్యాయాలకు బాధ్యుడు కుటిలుడు! మీముందు మీ ముఖస్తుతి కబుర్లు చెప్పి, మీ వెనుక తన స్వార్థం కోసం ఎన్నెన్నో అక్రమాలు చేయించాడు కుటిలుడు! కుటిలుడు నాకు కూడా మహారాజ పదవీ ప్రలోభం కలిగించాలని ప్రయత్నించాడు. నేనూ నాటకం ఆడాను. అతడు చెప్పిన ప్రతిదీ అంగీకరించినట్లు నటించాను. ఇలా నా చేత నటింపజేసింది కూడా మన అంతరంగిక మంత్రిగారే!

"మహారాజును పదవీ భ్రష్టుని చేయాలనీ, తనకు నచ్చిన వాణ్ని సింహా సనం మీద కూర్చోబెట్టి తన స్వప్రయోజనాలు నెరవేర్చుకోవాలనీ ఏనాడో కుటిలుడు సంకల్పించాడు. ఈ కుట్ర మహారాజుగారికీ, అంతరంగిక మంత్రికీ తెలిసింది. ప్రజలకు కుటిలుని నిజరూపం తెలియజేయటానికి కావలసినంత వ్యవధిని మహారాజుగారు కల్పించారు.

"నిన్న మీరంతా కలసి భల్లూకపతికి నిర్ణయించిన శిక్ష, ఈ రోజు కుటిలునికి వర్తిస్తాయి," అంటూ రక్షణమంత్రి ప్రజలకు వివరించారు !

ప్రజలంతా ఆశ్చర్యపోయారు !

"ప్రజలారా ! ఇకనించీ కుటిలుని కుతంత్రాలను మరిచిపోండి ! ఈ జంతువుల రాజ్యంలో సింహం ఎప్పుడూ రాజుగానే వుంటుంది. నా స్థానంలో కూర్చొని పరిపాలనా బాధ్యతలను ఇకనుంచీ మీ యువరాజే నిర్వహిస్తారు. ఇతనుంచీ ఆయనే మీకు మహారాజు," అన్నారు మృగేంద్రులు.

ప్రజలంతా జయ జయ నినాదాలు చేశారు.

"ప్రజలారా ! నేనింత వరకూ గొర్రెలలో మేకల్లో బ్రతికాను, నాకు బలహీనుల బాధలు తెలుసు. నా పరిపాలనలో అలాటి బలహీనులు కూడా ఏ బాధా లేకుండా అందరితోనూ సుఖంగా బ్రతికే ఏర్పాట్లు చేస్తాను.

"కుటిలుని వల్ల మీరెంతో బాధలు పడ్డారు. మీబాధలకు కారణం కుటిలుని స్వార్థం ! నా పరిపాలనలో కుటిలుని వంటి స్వార్థ పరులు వుండటానికి వీలులేదు !

భల్లూకపతివంటి నిస్వార్థ సేవకులతో, వ్యాఘ్రేశ్వరుని వంటి ప్రభుభక్తి పరాయణులతోనూ నా పరిపాలనా యంత్రాంగం నిండి వుంటుంది !

"మీరంతా మీ మీ బాధ్యతలను నిర్వహిస్తూ, ధర్మం, న్యాయం తప్పకుండా అందరి శ్రేయస్సులో మీ శ్రేయస్సు చూస్తూ సుఖంగా వుండాలి" అంటూ మహారాజ పదవిని స్వీకరిస్తూ యువరాజావారు ప్రజలకు హిత బోధ చేశారు.





ప్రజలంతా సుఖంగా బ్రతికే ఆ రాజ్యంలో కుటిలునికి స్థానం లేకపోయింది_ కుటిలునికే కాదు, కుటిలుని వంటి స్వార్థపరులందరికీ అక్కడ చోటులేదు!

అందుకే అందరూ సుఖంగా బ్రతికారు.

( అయిపోయింది )

